శ్రీరస్తు

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# గరుడాచల నాటకము

## యక్షగానము

పరిష్కర్త: ఉత్పల. వేంకట రంగాచార్యులు.




ప్రకాశకులు:

**ఎన్. వి. గోపాల్ అండ్ కో.,**

**నెం. 63, కృష్ణప్పనాయకన గుంట వీథి,**

**మద్రాసు-1**

**1958]** ** [వెల 0—7

శ్రీరస్తు

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# గరుడాచల నాటకము

## యక్షగానము

పరిష్కర్త: ఉత్పల. వేంకట రంగాచార్యులు.




ప్రకాశకులు:

**ఎస్. వి. గోపాల్ అండ్ కో.,**

**నెం. ౨౩, కృష్ణప్పనాయకన్ గుంట వీధి,**

**మద్రాసు-1**

**1958]** ** **[వెల 0-75**

# శ్రీ పోతులూరి
# వీరబ్రహ్మంగారి చరిత్ర

(340 పేజీలు — మంచికాగితము — మేలురకము బైండు)

(బ్రహ్మంగారి చిత్రపటము - షట్చక్రములను సూచించుపటము
యోగాభ్యాసనా విధానములు చూపు అనేక చిత్రపటములతో సహా

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే"

**బ్రహ్మంగారి అవతార విశేషములు:—**

దివ్యతేజోమయుడైన బ్రహ్మంగారి జననవిశేషములు-బాల్యము-తల్లికిజ్ఞానోపదేశము - దేశసంచారము - గోపాలకుడుగ నుండుట - మహాభక్తురాలైన ఈశ్వరమ్మగారి చరిత్ర - బ్రహ్మంగారు కాలజ్ఞానము వ్రాయుట - వివాహము ఏరీతిగ జరిగినది - సంతానము కలుగుట-బ్రహ్మంగారి లీలలు - ప్రజలకుచూపిన మహిమలు - సాంఖ్యయోగ వివరణ - పంచాక్షరీ మంత్రజప విధానము - కులమతభేదములను ఖండించుట - అజ్ఞానులైన ప్రజలకు జ్ఞానోపదేశములు గావించుట - షట్చక్ర రహస్యము లెరిగించుట - మహాభక్తుడైన సిద్ధయ్యకు జ్ఞానోపదములు గావించుట - బ్రహ్మంగారి మతవిశేషములు - సిద్ధయ్య జీవితచరిత్ర - సిద్ధయ్య యొక్క నిశ్చలభక్తి - సిద్ధయ్య చూపించిన మహిమలు - బ్రహ్మంగారు సిద్ధయ్యకు సృష్టివిధానము యెరింగించుట - కర్మయోగవివరణ - బ్రహ్మంగారు తీర్థయాత్రలు సేవించుట - త్రోవలో ప్రజలకు జ్ఞానోపదేశములు చేయుట - ప్రజలకు తన మహిమలు చూపించుట - సిద్ధయ్యకు మోక్షమార్గము తెలుపుట - జీవసమాధి యందుండుట - సమాధివిశేషములు-కాలజ్ఞానము-హఠయోగాభ్యాసనా విధానములతో-చిత్రపటములతో - ఇంకను పెక్కు విషయములతో—

ప్రతివారును తప్పక చదువవలసినది:—

ముచ్చటైన రంగులజాకెట్ గలబైండు గ్రంథము వెల రు. **3-00**

---

## యన్. వి. గోపాల్ అండు కో.,

**తపాలుపెట్టె 74—నెం. 68, కృష్ణప్పనాయకన్ గుంటవీధి మదరాసు-1.**

# గరుడాచల నాటకము

గీ॥ పలికెదను నేను గరుడాద్రి ప్రభుని చరిత
ఎఱకని మదిలోన దలచియు హాయిగొలుకు
భద్రగిరి రామచంద్రుని భజనఁజేసి
యాదవాఖ్యుండు రచియించె ముదముతోడ॥

క॥ శ్రీ కనకాద్రిని వెలసిన । రాగద్వేషాది రహితు రాజలలామున్
బాగుగ సేవించెద నా।నగధర నాగేంద్ర శయన నాథుఁదలంతున్॥

వ. అనుచు శ్రీలక్ష్మీ నరసింహ దేవుండు వేటకుఁబోయి, చెంచు వనితను పెండ్లియాడుట యనెడి శ్రీపద్మపురాణస్థ ప్రబంధంబు నాటక రూపకంబునఁ జేయంబూని, హరిహర బ్రహ్మాదుల గొనియాడి, యిష్ట దేవతా ప్రార్థనంబుం జేసి, కాళిదాసాది కవులకు వందనం బాచరించి, సకల ఋషి జనంబులకు నుతులు గావించి, శ్రీభద్రాచల సీతా రామా ర్పణంబుఁజేసి ప్రారంభింపబడిన యీ కథాక్రమం బెట్టిదనిన.

కీర్తన

స్వర్గములోపల సభలో నుండెదమమ్మ సన్నుతాంగి - అనర్గళ ముగ మేము ఆటలాడుదుమమ్మ సన్నుతాంగి ॥పల్లవి॥ మునికుల నాథుని విడువక గొలుతుమే సన్నుతాంగి - గోత్రరిపుని మేముగొలిచి సేవింతుమే సన్నుతాంగి - ఈధాత్రిరాజులు మమ్ముఁ దలచుచుపిల్తురే సన్నుతాంగి - తపసులనందరి చపలులజేతుమే సన్నుతాంగి - మేముసతతము భద్రాద్రి స్వామిని గొల్తుమే సన్నుతాంగి॥

క॥ ఓభామలు మీరెవ్వరు । యీ భూలోకమునందు హితమతియుతులై
ప్రాభవము నెందుగానము । మీభావముమాకు వేగ తెల్పగవలయున్॥

క॥ ఆరీతిని తెర వెళ్ళియు । వారీలాగనిరి మేము బహువినయముతో
నూరును సేవవచింతుము।కోరికతో విన వె చెలియ కొనియాడెదమే॥

రంభోర్వశులమమ్మ ఓయమ్మ ఇంద్రరాజ సభలో నుండుమమ్మ- విజృంభణముతోడ మేము జంభవైరిసభలో నెపుడు గంభీరముతోడ నాట్యము సంబరమున జేసేటి ॥రం॥ కంఠహారసరుల నాడగా దేవతలంత వెంటనే భ్రమజెందిచూడగా - తుంట విలుతుడు మమ్ము గెంటజేతామ నుచువచ్చి వెంటనే తావచ్చిగొనియు కంటగించి మింటికెగర ॥రంభో॥ పచ్చలాముత్యాలు సొమ్ములు తేజమందగా వచ్చెనే మదనుని యమ్ములు

హెచ్చుగా మోహాము జేసివచ్చి రాజులనెల్ల ఇచ్చతో భోగములిచ్చి మెచ్చికల్గఁ జేసినట్టి ॥రం॥ అంగన బంగారు చీరెలుజల్తారు సొమ్ములు జేరాడ గలుగు రంగుగ శ్రీభద్రగిరి రాఘవుని సేవించుచు పొంగుచు వచ్చితిమమ్మ అంగజ బాణములాస ॥రం॥

క॥ బంగారు వలువ గుల్కఁగ - సంగన మణులారమీర లతిప్రేమతో రా
సంగతి గూడుక మీరలు । పొంగుచు వచ్చితిర నేడు పొలతిరో చెపుడీ॥

రంభ - సీసార్ధము

జంభారి సింహాసనంబునఁ గూర్చుండి దంభోళి జళిపించి జృంభణముగ
నంభోజ గర్భాను లందరు భ్రమజెంద సంభ్రమమున మునుల్సన్నుతింప
గుంభినీధవుడైన యంభోజనేత్రుని గంభీరమున ప్రేమ గడలుకొనగ
కుంభజాదిమునులు కుంభికుంభము లెక్క దేవత లాడంబమునుజూప
నంభోజ సంభవుడు సంబరమునజూడ డంబముతోడనే రంభనువినవయ్య॥

ఊర్వశి - సీసార్ధము

బదరికాశ్రమమందు భగవంతుడుపరముండు నరనారాయణు లనగ వెలసి
తపమును జేయుచు ధన్యులై యుండగా నగచూచివారలు నదరిపడియు
రంభనుజూచియు రమ్యతతోబోయి విఘ్నములును జేసి వెలదిరావె
సరగునవచ్చియు సరసంబులాడితె సురలు కోపము జేయ పూర్వులపుడు
మరియును విప్పిజూచియు సురలు భ్రమజెందిచూడ
తరుణులు బుట్టిరపుడు మురియుచు నూర్వశిని కరుణతో వినరయ్య॥

మేనక - సీసార్ధము

మహనీయఋషులంత మందరగిరియందు బొందుగాతపములు జెందగాను
పర్ణంబులనువారు పదపడిభక్షించి వంశతేజంబున నొనరదాల్చి
ఘుంటలుమిన్నంట గాజూచియింద్రుండు వెంటనేరంభను నేగుమనెను
నూర్వశిచెలులంత నురుకుచు తావచ్చి ఘనముగా నాట్యమూడుచు
సంములో ఋషికన్యలను కోపమొందగా వినుమో చెలులారా
మనసున ప్రేమలేదనుచు శపియించె మరియు నామేనకను॥

క॥ రంభా యూర్వశి మేనక । గంభీరముతోనుమీరు కలికిరో యిపుడుఁ గా
సంబరమాయెను జెప్పుడీ । యంభోరుహ నేత్రులార యడిగెద వేగఁ గా॥

రంభోర్వసులు

చ॥ ఇరవుగ నారసింహుఁడును నింపుచలింపగ లక్ష్మితోడుగా
నరమరలేక యప్సరలు నాడుచు పాడుచు నందమొందగా
మురియుచు సైనికాధిపతి ముద్దుగ గుల్క రిథంబునెక్కియున్
సరగునవచ్చి రాసభకు సంతస మొందుచు నుండుమా చెలి॥

ద్వారపాలకుని మాట

గీ॥ వినుము శుకవాణి యెవ్వరో వినుల లర। విందునాయమ్మ ముచ్చటల్విందు
గాను। నామరూపంబులను జెప్పునాకు నవని॥ మ్రొక్కి వేడెద జెప్పుమా
పురుషుని నింక॥

శ్రీలక్ష్మీదేవి వచ్చుట

శ్రీలక్ష్మి వేంచేసెను ఓజనులారా శీఘ్రుంబె ప్రభవించెను-శ్రీలక్ష్మి వేంచేసె భూలక్ష్మిసతులారలోలాక్షి యరుదెంచె లోకమాతయు నేడు-శ్రీ సకలాభరణంబులు మెరయగాను చనుదెంచె పూబోణియా మకర ధ్వజునితల్లి - మాణిక్యములబంతి శుకవాణుఁబందరు ప్రకటించి కొలువగా శ్రీ॥ మెంతో శృంగారంబునఁ జూచితె వసంతుని భ్రమగుల్కను - వంతు కెక్కిన పూలబంతు లాడుచురాగ కాంతలు తనచుట్టు రంతులు చేయగా ॥శ్రీ॥ ప్రభగుల్క నగుమోముతో దిక్కులు వెల్గు వెల్గుతో। ఇభరాజ వరదుని యింతియు భద్రాద్రి సభికులు మెచ్చగా వేంచేసె మాతల్లి ॥శ్రీ॥

ఉ॥ శ్రీ పరమేశునిన్ దలతు చిత్తము లోపల భక్తచేతనున్
నాపయి దృష్టినుంచుమని నమ్మితి వేడితి పాదపద్మముల్
భూపతి భద్రశైలవర భూతనుజా రమణుండు బ్రోచునన్
నోపగ యాదవాఖ్యుడను నొయ్యన సేతు నృసింహ సత్కథల్ ॥

కీర్తన

శ్రీ భద్రాచలవాస శ్రీ లక్ష్మీలోల శ్రీ నారసింహా। ప్రాభవంబున నిన్ను భక్తితోఁ గొలిచెద నారసింహా। కోటిమణుల కిరీటము గలవాడ నారసింహా। హాటకమణులచే ఆదిత్యభానుడ నారసింహా। నవరత్న కేయూర నవమోహనాంగ శ్రీ నారసింహా। భువనపావనచరిత భవబంధ నాశన నారసింహా। మోదముతో భక్త సాధుజనస్తుత శ్రీ నారసింహా। యాదవదాసుని బాధలు మాన్పిన శ్రీ నారసింహా॥

లక్ష్మీదేవి చెలికత్తెలతో చెప్పుట

గీ॥ వినుము కమలాక్షి తరలాక్షి వీనులలర । గరుడగమనుండు శ్రీహరి కథలువేగ । యాదవాఖ్యుఁడు రచియించె మోదమలర । లక్ష్మీనరసింహ చరితము రమణి వినవె॥

ద్విపద

వినవమ్మ యొకమాట విశదంబుగాను – మనవిచేకొనవమ్మ మన్నించవమ్మ – మా కేలకథలును మరివినవమ్మ – సాకల్యముగ నిన్ను సన్నుతించెదను – ఆదిశక్తివి నీవు హరితోడ ముందు – మోదంబుతో దుగ్ధ పాథోధి యందు – జననంబునొందిన చంచలనేత్రి – పణతిరో మాయమ్మ వైకుంఠమాది – రణముల మేటమ్మ రాజధానియును – మా వైభవము లెంచ మరి వశముగాదు – యే వైభవంబులును నెంచవచ్చు – కొమ్మరో నేపైడిబొమ్మ నోయమ్మ – కమ్మవిల్తుని నాకు ఘనపుత్రుఁడమ్మ – ఆది శేషుని పాన్పునందంబు చెంద – మోదంబుతోనిటు మునినిగానుండు – శ్రీ దేవిభూదేవి శ్రీలక్ష్మి దేవి – పాదంబులొత్తుచు బతితోనుగూడి – యతివరో సుఖమందె నానందపడుచు – ప్రియమఁతోనుందుము విను మొక్కమాట – తెలివిగఁజెప్పెద తరువాత నేను – కరుణతో మాపూర్వ కథలన్ని వేగ – భద్రగమనరో నేను పతితోనుగూడి – భద్రాద్రి యందును ప్రబలుచునుందు.

(లక్ష్మీదేవి తెర వెడలివచ్చుట)

దేవినే లక్ష్మిదేవినే ఆదిదేవునే-ఆదిదేవినిభార్యను, భామాలను భక్తుల బ్రోచిన దేవినే। కలికినే నరహరి చిలుకానే కలికిచిలుకాలకొలికి। మధురంపుములికినే జనులకు ఫలమిచ్చెడి దేవినే। ఇంతిసేమంతులబంతినే యింతినేను విరులబంతులే నాడుచు కాంతరో శ్రీహరి కాంతుని నమ్మిన దేవినే ।. భామానే నరహరిప్రేమనే । భామరో భద్రగిరిధాముని దేవిని కోమలి భక్తజనస్తోమము నేలిన ॥ దే॥

ద్వార-గీ॥ కమలదళనేత్రి వినవమ్మ కమలనాభు
భార్యవగుటయుఁజెప్పవే పద్మగంధి
జననమైనది యెక్కడ జనకుఁడెవఁడు
పుత్రుఁడెటువంటి వాడమ్మ పువ్వుబోణి॥

లక్ష్మి-క॥ అడిగినముచ్చటఁజెప్పెద।నడవడిజననంబు నాదునాథు ని పేరుఁ
పుడమిని జనులకుసంపద।లిడుచును రక్షించుచుందు నీజన మునా

### కీర్తన

చెప్పెద వినవమ్మ చెలియనీవు నేచెప్పెద వినవమ్మ యొప్పుల కుప్ప మునుపు సృష్టిలోని భాగ్యమిప్పుడిచ్చెద చెలియా— అమ్మరో తరుణీ యసం దు రేనమ్మ కమ్మవిల్తునితండ్రి — నెమ్మదిలోపల నమ్మిన ముద్దులగుమ్మానే తాళను — నిష్టముతోడ నిచ్చెద చాల యష్టభాగ్యంబులును— నతిప్రేమ తోడుత సృష్టిలో జనులకుఁగట్టిగనిచ్చెద సుందరివినవె — నాయందము కనవె పొందుగా భద్రాద్రి—ఇందిరారమణుండు కుందరదన యీనందుకు రాడాయె ॥ చె॥

### సీసార్థకము

శ్రీవిష్ణుదేవుని శ్రేయంబు మదిలోనదలచి నేజెప్పెద తలిరుబోణి
వినెడువారికినెల్ల విశదంబుతోడు తమోక్షముగలుగునే మోహనాంగి
జననమరణములు కసరవెళ్లుయునను కరుణలక్ష్మి శుకుడుగలఁడెకొమ్మ
మందారమకరంద మాధుర్యమును ద్రావినట్టుల హరికథనయముతోను
భక్తవత్సలుండుభద్రాద్రిరాములు కరుణతోగలుగ జేయు నెసీతారాములు
మురియుచు గలుగ జేయునే ధరణిలోభక్తజనులుమురియుచు
చరణములుమరువక తలచెదరు మదిలోనబాయకను
కరుణతోఁగలుగ జేయునే సీతారాములు మురియుచుగలుగఁజేయునే॥

సీ॥ ఆదియుగంబున నాకాలమందున బలిచక్రవర్తియు బలముచేత
నింద్రుని నోడించి యిలయెల్ల నేలెను జేకొని గృహమున శీఘ్రమునను
దండకాటవిలోన ఁదగజరించియు నింద్రుఁ డలసట పడుచు నంతట
దోణంగె। దూర్వాసుడందు దపంబున శాపమెందుకునిచ్చె జెప్పలేను
రాజ్యమందునరాగ సురర పూదండ నెందుకు నిచ్చెవాడు నిచ్చితే
వారికెందుకు ముక్తివచ్చెను పొందుగ దీని నాదినందును శారవైచి
అందుకే శాపమిచ్చె యెందుబోదు నేను యెందుకు నాకు నిచ్చెను
ఇచ్చితే వారికెందుకు ముక్తివచ్చెనను॥

సీ॥ అనుచు నీలాగు నాపదనపడుచును సురలతోఁగూడుక సురవరుండు
బ్రహ్మవద్దకుపోయి ప్రణతులు జేసియు తన ముచ్చటంత యుదగగ
జెప్పి। యేలాగుచేతుము నెక్కడ బోదుము త్రిభువనంబుల మేము
దేవదేవ। యనగానె బ్రహ్మయు నతిచింతనొందియు బలికెను మృదు
వయిన పలుకు నొకటి। క్షీరాబ్ధికడకును హరి చేరబోదము రండి।

వేగ లక్ష్మీనాథుని పాదములంటను దలంచెదము । వేదంబులానుకేటిని నానా విభవముల । నాట్యాదరమైన నర్త్సేవసద్భక్త పోషాకుం డని । వేగము శ్రీలక్ష్మీనాథుని పాదములెందు దలచెదము । అని దానవారి యుపనద్ధిరయు వరియించు నిలిచెదము సురలిట్లులనిరి॥

॥ హాజగదీశ్వరా హాలక్ష్మీనాయకా హాజగన్మోహనా యాదిదేవ ।
హాబ్రహ్మజనకుడా హాహృషీకేశవ హాభక్తవత్సలా ఆదివేల్ప । అసు
రులువచ్చియు నమరుల వెడలించి త్రిభువన రాజ్యంబు దీసుకొనిరి ।
కావవేమమ్ముల కరుణాంత రంగుడా అనగానె వినియు శ్రీహరి
దృశ్యేందు । గాన వినుమనిపలికె యాహరి ఘనమైన యాపదలు
కడతేరేటందుకు । పనిమీకు జెప్పెదను బలిని జయించెదను అనగానె
వినియు శ్రీ హరిదృశ్యేందు గాన వినుమని పలికెను యాహరి॥

॥ వినుడు దేవతలార విశ్వసించియు మీరు బలిచక్రవర్తి తోడను
బాంధవంబు । చేసియు జలనిధి జేరియు బయలు మందరగిరి తెచ్చి
యు మరియువేగ । వాసు కిత్రాడుగా నొనరంగ జేసియు మర్దన
జేయుడీ మరియు మీరు । సకలంబు జనియించు సరగున వేగంబు
నమృతంబు వచ్చును నయముతోను । అదియు మీకిచ్చెద నను
మానమునులేక సరగున ననుభవించిన వేగంబె మీకు మరణము
తొలగు కాంచితె । సురలార నేగుడింక మరువక వచ్చెదను ।
దురము జేసి గాని పరువు లేదాయె మీకు॥

॥ అనగానె వినితాము అమరేంద్ర దివిజులు బ్రహ్మయు మునులును
బయలు దేరి । బ్రహ్మ నగరంబును పవపడి జేరియునాజ్ఞ దీసుక వచ్చె
నసురవిభుని । బలిచక్రవర్తితో బాంధవంబును సలిపి వినుమాట
చెప్పెద విదితముగను । మందరగిరి కేగి మరివేగ దెచ్చియు వాసుకి
త్రాడుగా నొనర జేసి । జలనిధి దరువంగజయముతో వేగంబె దను
జేంద్రసుధ పుట్టును మనమందరు । తినఘనమైన బలమువచ్చును ।
ఇదేమీ యొగ్గెమిలేదు మనసులో క్రోధముడిగి । అనుమానమేమి
లేదు అతి ప్రేమతోను వేగ దనుజేంద్రసుధ పుట్టును । మన సూర
గించిన ఘనమైన బలము వచ్చును॥

॥ బలిచక్రవర్తియు బలాకులువినితాను సంతసించెనునట్లు జేతమనుచు
దనుజులుసురలును ధ్వనులు జేయుచునేగి మందరనగమును మతియు

గాంచి । పుట్టునువలగొని గట్టిగా పెకలించి శిరములపై నెత్తి శీఘ్ర
ముగను । జలనిధికడకును జేరదీసుకొరాగ ధరణిపయి బడి సురలెల్ల సిలగ
కొందరు కొచ్చిరి కొందరు మ్రగ్గిరి అందరు భీతినొందిరి । దేవతలంత
యిందిరానాథుని బిలిచిరి । సందేహమును లేక సర్వేశ్వరుండంతలోన
నందముగా వచ్చి తా మందరనగము లేపె॥

సీ॥ మరల తీసుకవచ్చి మందరాద్రిని వేగ జలనిధిలోపల జేర్చిరపుడు ।
వాసుకి త్రాడుగా జేసియు నొనరంగ తరువ బట్టిరి పాము తల్లడిల్లగ ।
వదలండి యనుచును ఫణి పలుకుచుండగ తరువ బట్టిరి మహాధైర్యము
నను । అంతలో గిరియును ఆగక వేగమగాధ జలధిలోను బడెను పడగ
నందరు ఖిన్నులై యసురులు ఖేదించిరావే యోరాక్షసాంతకా ।
మమ్ముల బ్రోచి కావవే సర్వరక్షకా । భూవర నగము వచ్చె త్రోవ చూపవే
మాకు । భావజజనక నేడు బ్రతుక జేయవే తండ్రి । రావేమి రాక్షసాంతకా
మమ్ముల బ్రోచి కావవే సర్వరక్షకా॥

సీ॥ భక్తుల మొర విని పరమాత్ముడప్పుడు కూర్మరూపము దాల్చె కుంభినీ
ధవుడు । జలములో జేరియు జలచరాదులు బెదర నగమెత్తు మీదికి
నంబుజాక్షు । తరువాత దేవతల్ తరువ సాగిరి వేగ సప్తర్షులను బుట్టి
రందులోన । ఐరావతంబును నశ్వంబు విషమును జలములో జన్మించె
జెప్పవశమె । తదుపరి నే బుట్టి ధవళాక్షిరో గజమెల్ల సన్నుతింపగాను ।
ఇంద్రుడు బ్రహ్మనగుచును నన్ను మెచ్చగా । గగనమునందు దేవ
గణము పూవులజల్ల । ధగధగమనుచు తరుణిరో మెరయగాను॥

సీ॥ తాను వేంచేసియు తా నన్ను నను జూచి చిరునవ్వు మొగమున జిలుకు
చుండ । నాతిరో నను జూచి నవ్వినంతలో తాను సిగ్గుచే ముఖమును
చిన్నచేసి । మగుడి తాను నను జూచి మరి నవ్వినంతలో వనజాక్షి ముఖ
మును వంచుకొంటి । నా రీతి గాగను మీ రీతి బ్రహ్మయు వేంచేసి కలి
సిరి వేరు లేక । సకలాభరణములు సరగున నిచ్చిరి । రత్నాంగదుండు
ప్రేమతో పెండ్లి చేసె । కుసుమశరుండంతలోన భ్రమలు పుట్టించె
మాకు విమలచరితునికి విను నేను భార్యనైతి॥

సీ॥ శ్రీనరసింహుడు శ్రీరమావిభుడమ్మ మన్మథుడు పుత్రుడు మందగమన ।
సాగరుండు తండ్రి సఖియరో వినవమ్మ కావేరి కృష్ణమ్మ కరుణతోడ ।
తల్లులు మాణిక్య తరలాక్షి వినవమ్మ చంద్రుండు ననుజుడు చెలియ

విరవె॥ యీరీతివారమునిలలోన చెలువొంద పూజించుచుందురు పూవుబోణి । తరువాత జలధితో ధన్వంతరియు వెడలె సుధయును గొంచువచ్చెను । అదియు దనుజుడు సుధయు నెత్తుకపోయెను రద యుడు భద్రగిరి । స్వామీ మోహినియై సుధను దీసుకవచ్చె సుర లకు వేగమపుడు – సుధను గొనివచ్చెను । అదిజూచి ధనుజుడు సుధయు నెత్తుకపోయెను॥

ఉ॥ ఈ కథవిన్నవారికిని నీశుఁడు నిచ్చును సర్వసంపదల్
లోకమలాక్షిరో వినవె వాక్యము జెప్పితె యాదవాఖ్యుడున్
శ్రీకరమై భువిన్ గలుగు చింతలు బాయును వృద్ధిబొందుచున్
జోకవనుండు నెల్లపుడు జానకిరాముఁడు నిష్టకాముఁడై॥

కీర్తన

అతివరోపోయి వచ్చెదనమ్మ గరుడాద్రి నరహరుని జూడనే కొమ్మా–పతితపావనుఁడు పరమదయాళుఁడు – అతులితప్రేమతో నాద రించు నిక॥ అతివరో ॥౧॥ వారిజాక్షీ నారదుండువచ్చి వీణెమీటుచును పాడ । సంగీతము బాడుచు హెచ్చి! మురియుచు తరుణులు నాట్యము లాడగ । గరుడులు యక్షగణములు పొగడగ ॥అ॥ నరహరి తానువచ్చునె కొమ్మ దాసులందరు మురియుచు పూజలు సలుపుదురమ్మ । గరిమతో వేగమెకనకరథంబును సరగున నెక్కియు ధరణీనాథుఁడు ॥అ॥ కరుణతో భద్రగిరియందు యాదవదాసు మరువక హృదయమందు పొందుగ సుం దరివిను మేమందరముతోడుత పొందుగ నరహరియందు చేరుదుము ॥అ॥

కీర్తన

ఎరుకతతావచ్చెను అవ్వోయవ్వా యెరుకతతా వచ్చెను । యెరుక తతావచ్చె యేడేడుభువనాలు । మరువక నెరుకయుమరి వేగ జెప్పుచు॥ నవరత్నములుదాచిన పెట్టెయు వేగ నయముతో శిరమందున । భువన మోహనురాలు పుణ్యచారిత్రయు నవనిలో జనులంత యమ్మరమ్మని పిలువ । పంచరంగులచీరయు మధ్యంబున కంచుకంబును దొడగియు । పంచబాణుని చిలుకరమణికల్యాణియు నెంచశక్యముగాని వెలదులు చెలువుగ । మణిమయహారంబులు భామలార కాళ్ళందెలు ఘనముగా మ్రోయగను । మాణిక్య ముత్యాలహారము శోభిల్ల వేణియునల్లాడ విరుల బంతులుజార । బాలను దానెత్తుక భద్రాద్రీశుల బహునేర్పుగ । లోలాక్షి కమలాక్షి లోకమాత షాలాక్షునతినుత పరమకల్యాణి॥

ఉ॥ శ్రీ నరసింహమూర్తిఁ దలఁతు శ్రీ పరమేశుని పాదపద్మముల్
సారసనేత్ర నీ హృదయమున స్థాపితముఁ జేసియు కీర్తితో ముఖున్
మేరువు ధీరుడున్ సకలమేదినినాథుడు భక్తపాలుడున్
భారముతోడుతన్ మదిలో భద్రగిరీశుదలంచి మ్రొక్కెదన్॥

గీ॥ సకల భావజుడను జాల సమ్మతుండు యాదవాఖ్యుండు భక్తుండు యదుకులేశు। పాదపద్మంబుల దలచి భక్తితోడ పరమజ్ఞానంబు ఎఱుకతా ప్రజలు వినుడి.

కీర్తన

రహింమించు నెఱుకత రమణినాపేరు మోహానాంగి నేసహజముగ బ్రహ్మసంతతిగలదాన మోహానాంగిఆరుగిరుల తేరుయుందొక్క బాలుడే మోహానాంగి - దివ్యరూపుని గూడుక నయముతో నుందుదే మోహానాంగి। ఆరుగిరులమీద అమృతంబు కొలనులో సన్నుతాంగి। నేగ మీదు తమ్మెదమ్రోత చేరిసుఖించవే సన్నుతాంగి। రెండుచక్షులమధ్య కుండలిసరమందు మోహానాంగి। ఆపుండరీకమందు నుండును బ్రహ్మంబు మోహానాంగి। అక్కడినుండేటి అయిదుశక్తులుజూడు మోహానాంగి। వేగనిక్కి చూచుచునొక్క నక్కగూయుచుండు మోహానాంగి। చుక్కల లోపలచక్కని బాలుఁడు మోహానాంగి। వేగమిక్కిలి తేజంబుతో నున్నాఁడుసన్నుతాంగి। బ్రహ్మాండనాథుండు భద్రగిరీశుండు సన్నుతాంగి యీ బ్రహ్మాండమంతయు బయులయి మ్రోగునే సన్నుతాంగి। యాదవవాసుని యందుఁజేరినదాన మోహానాంగి! వేగ నాదబిందుకళ నయముతో మీరెను మోహానాంగి॥

గీ॥ ఎరుక ఎరుకయంచు నెలమితో బలికేవు। ఎఱుక పటుపుమారు యేగిరమున తెలియ జెప్పనాకు దేజంబుతోడుత। నూరు పేరు బలుకను చితమగును॥

ద్విపద॥ వినవమ్మవో యమ్మవిన్న పంబొక్కటి - కనవమ్మ యెరుకయా గన్నుల నిండు - మాయామారు నడిగితి మరి చెప్పెదాను - భావజ్ఞు రాలవేపణఁ జిరోసీవు - సూర్యచంద్రులనడుమ చుక్కలమీఁద బంచరంగులలోను పైనొక్క మేడ - పంచవింశతిభటుల్ పైఁదిరుగు చుండ - సూక్ష్మంబు దరువాజ జూడనొకవింత లక్ష్మీనాయకుండనే నారాయణుండు - దరువాజ యొద్దను తగఁదురుగుచుండ - కరుణతో

నాగేంద్రుఁ గావలియుండు - అష్టదళ పద్మంబు నామీఁదటను - త్రిష్ట ముతో బ్రహ్మపధ్య మిల్లవ్రుసుమాకు - నిర్వికార బ్రహ్మమగుచు నానుండు - సరజ్జువకు నెల్లగారన నేత్రి - పరభద్రదేవ్రుఁడౌ పంద్యుండు మముఁ గీ - కరుణతో చూదవలె చెంనుఁ జేరి.

ద్వారపాలకుని మాట

క॥ తరుణిరో తెరకను తెళ్ళుము । కరుణతో మీకథలుమాకుకషులవళాక్షీ
సరగునఁజెప్పుము బ్రొక్కెదుఎరుకలనాంచారుబొమ్మ యెలమినిరమ్మా॥

తెర వెళ్ళె కీర్తనలు

ఎరుక యెరుకవో యమ్మ ఆవ్వోళయ్యా ॥ఎ॥ ఎరుక యేడగమంత వెలుగుచునుండును । పరువకతిరిగేటి మగువను వినవమ్మ ॥ఎ॥ ఏడు కొండలమీఁద నెక్కించె యెరుక । జోడుగుండ్లమీఁద గూడించె యెరుక ॥ఎ॥ బ్రహ్మమధ్యంబున భాసిల్లె నెరుక । జిహ్వాలుసహస్ర శేషుండై యెరుక ॥ఎ॥ బ్రహ్మాండనాథుండు బాలుండె యెరుక । జిహ్వాగ్రమందున జేరించె యెరుక ॥ఎ॥ చూపుల్లో పాపనిచూచిందె యెరుక । పాపచూపు లోని బ్రహ్మంబె యెరుక ॥ఎ॥ రేపునూపు వెలిగెదీపంబె యెరుక । చుట్టును తిరిగేటి సుందర మెరుక ॥ఎ॥ తేటవెన్నెలబైటి తేజంబె యెరుక । తేజము లోపల రాజమె యెరుక ॥ఎ॥ మోదముతో భద్రనాథుండె యెరుక యాదవదాసుని యేలిందె యెరుక ॥ఎ॥

గీ॥ ఎందుజూడము మీవంటి యెరుకతనము । జ్ఞానదీపమువలె నీవు
కలిగినావు । ఎక్కడెక్కడ యెరుకయు నెలమిలోడ । జెప్పినావమ్మ
యోయమ్మ యొప్పుగాను॥

పంచామరమ

ఎందుఁ జెప్పినావటంచు నేదియెరుక నడిగితే
సుందరదన వినుము దేవబృందములు గొలువగా
సుందరీ జనంబులంత జూచినన్ను బిలువగా
ఇందువచ్చితిని వినుము నింపుతోను జెప్పెదగా॥

కీర్తన

ఎరుకజెప్పిరమ్మా ! ఓ ముద్దుగుమ్మా । కరుణతో కన వేకన కంపుబోమ్మా । యెరుక యెరుక నేడుజగములు । మురియుచు నీరీతి దన ముచ్చటజెప్పద ॥౧॥ బ్రహ్మలోకమునకు బోతినమ్మా । పార్వతీ దేవి నమ్మక నేను జెప్పితిబొమ్మా బ్రహ్మబ్రహ్మనవబ్రహ్మనుజూచియు।సొమ్ము

యిచ్చిన యమ్మరో వచ్చితి । వెండికొండమీద బోతివయమ్మా । పార్వతి యీశుని దండిప్రాజలు సలిపితివమ్మా మెండుగా పార్వతి నిండుహార ములు । కుండలంబులు కొమ్మరో యిచ్చెను । సత్యలోకంబునకు బోతివ మ్మా శారదాదేవి యత్యంత ప్రేమసలిపెదమ్మా । ముత్యంబుల తాము రియుచు నిచ్చెను । సత్యంబుతోనే సరగున జెప్పితి।తరుణి శ్రీ భద్రశైల మందు । సీతారాములకు మురియుచుఁ జెప్పవచ్చితి ముందు । ధరణిలో యాదవదాసుని నేలిన । వరహరిగానము సయముతో బాడుచు ॥౫॥

వ. ఇంకా యెటువలెనే చెప్పవమ్మా.

ద్విపద ॥ ఓ తరుణీమణి యో పువ్వుబోణి – ప్రీతితో వినవమ్మ నిత్యకల్యాణి । కర్నాట కొంకణ కాంభోజ ద్రవిడ । అంగవంగ కళింగ వంగ దేశముల । బంగాళి నేపాళ బర్బరసౌర।ఆంధ్ర పుళింద్రము నంతట దిరిగి । చంద్రసూర్యులయందు చరియించిమించి । గరుడగంధర్వుల గగన మార్గమున । నారద తుంబురుల నాట్యంబు జూచి । అన్ని లోకంబులు నంతయుదిరిగి – యున్నానుజగమంత నొప్పుగాదిరిగి । ఎన్నెన్ని జన్మాలు ఎత్తినగాని । నన్ను జేరెడువారు నయముతో లేరు । కమ్మవిల్తుని భ్రమల కడుమునిగిపోయి । యమ్మరో సుఖములు అనుభవించుచు । నుందును జగములో నొప్పుగావినవె । ఎరుకమరువులు లేని యెరుకను నేను । సర గున భద్రాద్రి స్వాములయందు॥

గీ॥ ఇంతి వినవమ్మ యీవూరు ఎవరిదమ్మ । సంతసించెను నామదిసఖియ వినవె । గరుడగమనుని నగరంబు గరుడగిరియు చూడవస్తిని నే నెంతో సుందరముగ॥

కీర్తన

ఎంతో శృంగారంబును గరుడాద్రివాసుని భ్రమజెందెను । ఎంతో శృంగారంబు వింతైనరంగుల కాంతలు పురుషులే కాంతములాడగ । మంతుకెక్కినరీతి కాంతునిమించిన । వింతైన చెలులతో బంతులు ఆడుచు ॥౧॥ పంచరంగుల తేరు ముత్యాలకాంచనాంబర గొడుగులు । పంచపర్వముల పాటలుబాడుచు ముంతవీణె జేయించియు మీటుచు మించి । గంధము మేననుంచియు । నెంచుచు చింతలేకను జనులు సంతో షింప ౨॥ ఆణిముత్యములను రత్నంబులవీణెయు । జెన్నారు రపముతో భేరీలు ధణధణమ్రోయంగ వీణెమద్దెళ్ళుతాళాలు మ్రోయంగ ॥3॥

గట్టించి పరజాప్రులూ మహిమేప్ర శోభనమూలు । చుట్టుకోటలు మహా దిట్టముతోడుత పెట్టిగ సౌమ్యులు పేదలయ్యాలలూగ । దిట్టముతోఁ బూల తోట్లుశోభిల్లగ సిద్ధపై నెలుగును ఘనుఁడు నరసింహుఁడు ॥౨॥ దాపున శ్రీ నరసింహులు వైరులనెల్ల శోధించి శిక్షించునూ । యీ పట్టము భద్రాద్రి యీశుని సాక్షిగా సాఫల్యమగునంచు । సద్భక్తులును కొలువ ॥౩॥

వ. ఆ సమయమున లక్ష్మీదేవి చెలికత్తెలతో నేమనుచున్నది.

గీ॥ అమ్మ వినవమ్మ యీమాట అద్భుతముగ । వార్తవింటిని నగరిలో వారిజాక్షి।సత్యమాడేటి ఎరుకలసానియొకతె । వచ్చితిరుగుచున్నది వాడవాడ॥

క॥ చెలులార వేగబోండికి।చలముడిగియు నెరుకఁజెప్ప చాననువేగన్ । పిలుచుకరండికి నడిగెదఁ । గలలో నేనొక్కవార్త గంటిని సఖియా॥

వ. ఆ సమయంబున చెలికత్తెలు యేమనుచున్నారు.

గీ॥ ఏమి కలవచ్చెనే యేమొ యిందువదన । మనసులో దిగులొందితే మందగమన । సాగుదుమునింక యెరుకలసాని కడకు । బిలచి వచ్చెదఁ జెప్పవే బిసరుహాక్షి॥

## లక్ష్మీదేవి - కీర్తన

కలగంటినో చెలియలార । మంచి కలయిప్పుట దెలియవె బాల । చెలగును శ్రీనారసింహుడు । తానేమొ చలముచేసి నాతో స్వామితా బోయెనట ॥క॥ వేటమార్గముపోయి తాను । బూలతోటలో విహరించగాను । పాటలగంధిరో నీటుగ చెంచుల బోటియొక్కతె । యీనాతినికూటంబు జేసెనట ॥క॥ యతివరుం డొకడుతావచ్చి నాకు । హితవుతో వివరించి చెప్పి యతివరోవనికిని అతడుతా నేగెను।హరినాతో బాసెనని కలువరింపుచునుంటి ॥క॥ ఈరీతి కలవచ్చె నమ్మా । నేనేమి సేతును ముద్దుగుమ్మ వాసిగ భద్రాద్రి వాసుడు ఇంకనేమో ప్రీతితో జేసునో యేరీతినో తెలియదు।

వ. చెలికత్తె యేమనుచున్నది.

గీ॥ చెలి విను కమలలోచను జేసినట్టి । పనులు నిజమానెఖేదంబు పణతియేల । నేనుబోయియు నెఱుకత నిందు దెత్తు । నడుగుదామమ్మ మనసులో నమ్మవమ్మ॥

## లక్ష్మీదేవి - కీర్తన

చెలితాళలేనే కలయట్టిదాన ॥చె॥ దిగులాయె నోనమ్మ మనవి నైకోనవమ్మ । పగబంగాత్రియొక పాలాయెనమ్మ ॥చె॥ సతివచ్చినేమో స్వామికి సాక్ష్యభాసు । పితమతో నాత్రాత ఫలమేమొగాని ॥చె॥ వర ఫల్రదానవంబంత వనదాండె భామా । సరసిజయూనరో స్వామికి తెలుపుము॥

వ. ఆ సమయంబున చెలికత్తె యెఱుకలసాని వద్దకు బోయి యేమనుచున్నది,

గీ॥ ఎవరు రావమ్మ యీయూరి కెవరు దొరలు । నమ్మ నినుజూచి నామది నందమొందె । సరస సంగీతములతోను సర్వజనులు । ఉన్నరోయమ్మ చూచితె యుచితముగను॥

చ॥ ఎఱుకలదాననేడు మరినెందున నుండియు వచ్చినావు ని
న్నెఱుగరు లోకులెవ్వరును నెన్నగరాని విశేష సంపదల్
కరుణతో నిచ్చునీకువిభు కంజదళాక్షిరో యాదిలక్ష్మి యూ
మురియుచునిన్ను దెప్పనను ముంజుగ బోదము రమ్ము భామినీ॥

గీ॥ వచ్చెదనుగాని చెలియరో వాంఛతోడ । మదిలోనున్నట్టి వార్తయు మందగమన । చెప్పి తేమియు నిచ్చేవు చంచలాక్షి । అడుగు నట్లుగ నాకిస్తె అందువత్తు ॥ఎంత॥

### వాదము

౧. ఎంత చక్కనిదానవె యెవ్వతె వో చెలియ - ఎవ్వతెవో చెలియ పంతంబుతోడ పట్టణంబెద్ది॥

౨. వెలదిరో విన్నవించెదము - నేవిన్నవించెదను - అలివేణి మాయా పురమ్మరో మాది ॥వెల॥

౩. వెలది యే లోకమునుండి వేంచేసినావె - బాలుని పేరు యేమి భాగ్యవతి చెప్పుమా ॥వెల॥

౪. బాలుని ముఖమున బ్రహ్మనున్నాడో - చాల తెలివితో తెలివి దేశమోయమ్మ ॥బాలుని॥

౫. నాథుని పేరేమి నాతిరో చెపుమా - ఏతీరువర్ణంబు ఎఱిగించవమ్మ॥నా॥

౬. నామ రూపులేని నాథుడే సఖియ - నాథుడే సఖియ - భామరో బయలులో బయలు మాయమ్మ ॥నామ॥

౭. బంధువులు ఎవ్వరే భామరో నీకు - ఓ భామరో నీకు - సందేహ
మేలనే సఖియరో నీకు ॥బంధు॥
౮. నిర్వికారబ్రహ్మ సర్వవ్యాపకుని - నిర్వాణపదులమ్మ నీతి బంధువులు॥
౯. రావమ్మ పోదాము లక్ష్మీపిలిచింది - ఓ లక్ష్మిపిలిచింది - భావంబు
దెలపవె భామరోనీవు - ఓభామరోనీవు ॥రా॥
౧౦. వాదమేలను నాతోడను జెప్పదగాని - మోదముతో నాకిచ్చి
ముచ్చట వినుమీ ॥వాద॥
౧౧. అడిగినవస్తువు అదియిచ్చెదగాని - ఓ అదియిచ్చెదగాని - బిడియ
మేలనురావు బిసకుందరదన ॥అడి॥
౧౨. ముదముతో భద్రాద్రిమాధవునిదలతు-యాదవదాసుని యేలితివమ్మ॥

కీర్తన

రావమ్మ యెరుకలసాని - మా రమణిపిలచెను దొరసాని రావమ్మ।
పోదాము రంజిల్లుచుమరి లేవమ్మ ముత్యాల బావిలీలిచ్చెద ॥రావమ్మ॥
మన్నించి నన్నేలవమ్మ-నీకున్నా సరములిచ్చెదనమ్మ-చిన్నబాలను ఎత్తు
కున్నావు మాతల్లి వెన్నెలుపుట్టవె వన్నెచీరలు యిమ్మ ॥రా॥ కొమ్మరో
రత్నాల కమ్మలు నేను సమ్మతిగా పైడిబొమ్మలు అమ్మరో ముత్యాల
కమ్మజోడిత్తు నమ్మవే నా మాటవినము మ్రొక్కెద రావమ్మ॥ ఆణి
ముత్యంబులు ముక్కర మాయమ్మరో నీకిత్తు చక్కగా ॥రావమ్మా॥
రాణించు భద్రాద్రి రాముని దేవిని-వేణియు జీరాడ వెలదియు రాగదె
రావమ్మా.

పంచచామరము

రమణి నీవు యింత నన్ను రమ్మటంచు బిలువఁగా
ప్రేమతోను వచ్చెదాను పెద్దలంత జూడఁగా॥
భామ వేగ సొమ్ములిచ్చి పంపవేగ పోయెదన్
నామనోహరుండు భద్రనాథు నేను దలఁచెదన్॥

వ. ఆసమయంబున ఎరుకల నాంచారు లక్ష్మీదేవినిచూచి ఏమనుచున్నది.

ఉ॥ చూచితినిన్ను నేను సతి సుందరికన్నుల వేడ్కలారగన్
భూసుర శ్రేష్ఠులందఱును పుణ్యచరిత్రిని బూజసేతురే॥
గోచరమాయె నీముఖము కొమ్మరో కోరినకోర్కె జెప్పగన్
రాజకులంబు వాడు నను రమ్మనిపిల్తురు మోక్షదాయినీ॥

వ. ఇంకా యేమనుచున్నది.

కీర్తన

సభచేసి కూర్చున్నది। ఆదిలక్ష్మి సంతోష పడుచున్నది। యిభరాజవరదుని యింతిజూడండి। సభికులు ప్రేమలు సభచేరియుండగ। నవరత్న పీఠంబున తేజంబుతో నవమోహనాంగంబునా। తవ గూడ గంధర్వ కన్యలందరు గూడి। భువనచారిత్రికి పూజసల్పగా ॥స॥ చిత్తరి చూపులతో చిత్రజు తల్లి ప్రతిమలతో। మత్తేభగమనయు మాధవుచారిత్రి సత్తుగ పూజించు నరభక్తితోడుత ॥స॥ అంగన కాంతులు మెరయగ। కోటి సూర్యాభరణాలు వెలుగొందగ। తరుణి శ్రీభద్రాద్రి నరహరిరూపుని కరుణతోగూడిన కమలవాసియు నేను ॥భ॥

వ. ఆ సమయంబున ఎరుకల నాంచారంజూచి లక్ష్మిదేవి యేమనుచున్నది.

చ॥ జగమున మేటివమ్మ నినుజెందినవారికి పెక్కు జన్మముల్
మగిడియు రావు నమ్మనతి మంపుతో నామది కోర్కెజెప్పవే
నగములో నర్ధమైతి మదిసన్నుతి జేసెద మోహనాంగిరో
గగనముఁ జేసె నామనసు కన్నుల నీరులు గారుచుండునే॥

వ. ఎరుకలసాని యేమనుచున్నది.

కీర్తన

కరముజూపవే కమలనేత్రి। కరుణించి నాతో సరగున బల్కవే కమలనేత్రి। ధరణిలో పేరైన దాతలెవ్వరికి। మురియుచు హస్తము బిర బిరచూపవే ॥క॥ సిగ్గేలచంద్రవదనా। బెగ్గిలి దేహంబు చిక్కి భీతినిబొందక। ఎగ్గులేమ నేయుంగూడ। నగ్గలముగ ప్రీతిగల్గ నతివరో చూడకు॥ క॥ మోహమునుంచక ననుజూడవే। చంచలాక్షియిక యేమిభయము నన్నుజూడు। సకలముంజెప్పెద సన్నుతాంగిరో। పకపకనవ్వుచు పణతిరో చూడవె॥ పైటదీయవె పద్మగంధి। నాతోడనుగూడి నరహరితో గూడి భ్రమలుజెంది। వేరులేకను వెలసెరో యుండుము। పూని భద్రగిరి జేరి యుండెదవు ॥కర॥

వ. ఆ సమయంబున నెరుకల నాంచారు ఏమనుచున్నది.

ద్విపద

శ్రీలక్ష్మివినవమ్మ సిగ్గేలనమ్మ – మేలైన నీకెల మేలుజెప్పెదను – చేతిలో శుభములు చెప్పెదవినవె – పాతరలాడను పరమకల్యాణి – పంచముద్రలుకల పరమాత్మదేవి –సంచితభాగ్యంబు చాలగాకలదు–పురుషు

డొక్కడునిను పూజోణివినవె - శత్రులెవ్వరునీకు జగమంతనీవె - సతి పతులిద్దరు సరసంబుతోను - అతిప్రేమతోడుత అమ్మరో నేడు - ఉందురు ఇకసుమ్మి యోపాలలామ.

క॥ బుట్టకుప్రొక్క వెయోసతి । పట్టవెనాచేయి సరస పణతిరో వేగ
చుట్టాలుజనులు పొగడగ । గట్టిగముత్యంబులిపుడు కానుక తేవే ॥

వ. చెలికత్తెయేమనుచున్నది.

క॥ సూటిగమదిలో కోరిక । నీటుగనీ చెప్పకునికి నేమముతోడ
పాటించు బట్టబయలును । వాటంబుగఁ బారవైతు వనరుహనేత్రీ ॥

వ. అప్పుడు ఎరుకల నాంచారు దేవతలను నేమని కొనియాడుచున్నది.

శ్రీవేంకటేశ్వరా సిరికొండవాస - రామయ్యరాగదే రఘు రామచంద్ర - మందరగిరివాస మహనీయవేష - పొంగుచునిను తలతు బోనగిరి దేవ - స్తంభాద్రినరసింహ సర్వజనపోష - కుంభినీనాధుడా గుంటగిరి నాధ - సత్య గిరినరసింహ సరి కొండదేవ - హెచ్చుగా బలికేటి మేలు కొండయ్య - ధర్మపురి నరసింహ తరికొండవాస నిర్మలగుణశాలి నీలగిరి స్వామీ - కాళహస్తి నివాస కమనీయ వేష - మాళవభూపాల మంద రాద్రీశ - శ్రీ రంగపురివాస శ్రీరంగ దేవ-సారంగగిరి దేవ సర్వజనపోష-కాంచీపురీవాస కాంచన చేల - వాంఛతో వేడెద వరమియ్యరయ్య-శ్రీ దేవిభూదేవి శ్రీ లక్ష్మి దేవి. ఆదిశక్తివి నీవు అంబటగలవు - ఆ కాళ వాణమ్మ ఆది దేవతవు - నాకు వాక్కియ్యవే నీకుమ్రొక్కెదను - మల్లికార్జున దేవ మమ్మేలవయ్య - కొల్లాపురెల్లమ్మ కొలిచెదనిమ్ము - కూర్మితోన హోబల గోపాలస్వామీ - వరభద్రగిరి స్వామీ నాకు వరమిమ్ము.

కీర్తన

ఆది మహంకాళినిన్ను ఆత్మదలచెదను । మోదముతో వేగ నీకు మ్రొక్కెద । కరుణింపవేవమ్మ కాళికాదేవమ్మ । వా రా హి ధూమ్రాక్షీ వాక్కియ్య రమ్మ ॥ఆ॥ ఆపశంకరిదుర్గి అతికంఠసుర వారి । మాధవి మహాలక్ష్మి మన్మథుని పుత్రి ॥ఆ॥ అపునమ్మ కల్యాణి అమర వందితురాణి । నవమోహనాంగి శ్రీనాంచారు రామ ॥ఆ॥ బాలాంబలలితాంబ భద్రకాళీ దేవి । బాలత్రిపురాంబ సన్నుతించెదను ॥ఆ॥ అను మకొండదుర్గి ఆదిశక్తివినీవు । కనకాంగి నన్నింక కరుణించవమ్మ ॥ఆ॥ భద్రములనిమ్మా భద్రాద్రిసీతమ్మ । అద్రిజాసుత రావే అతిప్రేమతోడ ॥ఆ॥

ద్విపద

కొల్లాపురి యెల్లమ్మ మ్రొక్కెద నేయమ్మా - మదిలోన క్లేశంబు మాపవే తల్లి - పరపురుషుని కౌఁగిలి వ్యాకులతఁజెందేవు- అతఁడెటువంటి వాఁడనినడిగితివేయమ్మ - కోటిసూర్యుల కిరీటముగలవాఁడె తల్లి - భుజమున శంఖ చక్రములు గలవాఁడెయమ్మ - వైజయంతీ మాలికా ధరుండె మా తల్లి - నవరత్నమౌక్తిక వజ్రవైడూర్య - గోమేధిక పుష్యరాగ మరకత - మాణిక్య కంధరుడు మాయమ్మ - యింద్రనీల దేహము గలవాఁడె తల్లి - గరుడగంధర్వ గమనుండె నాయమ్మ॥

వ. మత్స్య కూర్మ వరాహ నరసింహ వామన పరశురామ శ్రీరామ బలరామ బౌద్ధ కలిక్యావతారము లెత్తినవాఁడుగా నుండు నటువంటివానికి నీవు భార్యవే తల్లి శ్రీభద్రాచల సీతారాములు మిమ్ము రక్షించుగాక మాయమ్మ.

వ. లక్ష్మీదేవి యేమనుచున్నది.

కీర్తన

మాతల్లి యెఱుకలసాని నిన్ను మఱియొక్క టడుగుదామని - ఓ తల్లి శ్రీహరి కొప్పుగ నామీఁద- బ్రీతియున్నదో లేదో బిరబిర జెప్పవే ౧॥ మనసులో ముచ్చటఁజెప్పవే - ఓసుదతి వొప్పులకుప్పవే॥ వినవమ్మ నీకునే వనమాల నలరింతు - అనుమానమెందుకు నమ్మరో నీకిక ॥౨॥ వెన్నెలవేడిమి దోచునే - నావెన్నుని నెన్నడు చూతునే - కన్నెరో నామీఁద కాంతుఁ పుట్టెనో లేదో - యున్నట్లు చెప్పియు నన్ను మన్నించియు ॥౩॥ పరముభద్రాచల రాముడనేను - మరువకనునిక పరంధాముని - కరుణతో యాదవుని బ్రోచినస్వామిని - అటు మఱి జేసెను నమ్మరో తాళలేనే ॥౪॥

గీ॥ వినవె శ్రీలక్ష్మినీవిక విశదముగను । మదిలోనున్నట్టి వార్త నుమందగమన । వేగ జెప్పెదనీవిక వెఱవబోకు । గరుడగిరివాసు డింతలో కండ్లబడునే॥

కీర్తన

చెలినీకు కలవచ్చెనమ్మా - నేను జెప్పెద వినుముద్దుగుమ్మా॥ కలికిరో కలలోన శ్రీలక్ష్మి కలువరించితివమ్మ - ఫలమానో కాదని పణతి ఖేదింపకు॥ ౧॥ వేటమార్గము నందుబోయి-పూలతోటలో విహరించెనోయి-బూటకంబులుగావు పుట్టకే మ్రొక్కవే - పాటలగంధినా బాలునితోడను ॥౨॥

నరహరి తానేఘనమ్మ-యొక్కనాతి వింటుబుచ్చుకొమ్మా-కరుణ లేని వాడు కమలాక్షి నీవిభుఁడు-సరగున నీకొక సవతిని దెచ్చునే ॥క॥ ఇంతపని చేయునే బాలా నీవెంత చింతించినలోలా - ఇంతిరో భద్రాద్రి యున వంశనాథుఁడు - కాంతరో భ్రమజెందు కన్యకను దాఁజూచి ॥ర॥

గీ॥ ఒంట రెంట మూఁట నొనరంగ నాల్గింట। పదునారు నేడునాళ్లలోన
నానుదీన తేజ యామీఁదనొక్కతి। సవతియగును నీకుచంద్రవదనా॥

లక్ష్మీదేవిమాట - కీర్తన

ఫాలమందున బ్రహ్మ యేతీరు వ్రాసెనో - బాలరో నీకేమి ప్రాప్తంబౌనో-కలలోన జాత్రియు నలివేణి చెప్పెనిక-ఫలమౌను నరహరి పంతంబు నిజము - కానున్న నోదండి కలికిరో యెఱుకల - సానికి సాహ్యలు చాలగ ని య్యగే - భద్రాద్రిస్వామి పగజేసె నాతోను - భద్రగమనరో వేగగణపతి దెచ్చెద ॥ఫాలమందున బ్రహ్మ॥

వ. చెలికత్తె లేమనుచున్నారు.

ఉ॥ ఎఱుకలసాని మాటమఱి యెల్లను నిక్కముగాఁదలంచుచుఁ
మఱువక యుండి వేగమున మంచితనంబున ప్రాణనాథునిఁ
కరమును గారవించుమను గంజదళాక్షిరో మ్రొక్కుచుండవే
మగలును నారసింహుడిక మన్మథ వేదన లెందుకే చెలీ॥

వ. ఆ సమయంబున నెఱుకల సాంచాదున కనేకాభరణంబు లిచ్చిన తదనంతరంబున నేమనుచున్నది.

కీర్తన

కరుణఁజూడు పోయివచ్చెద - నో లక్ష్మీదేవి కమలనేత్ర నిన్ను మెచ్చెద ॥క॥ ధరణిలోను నెఱుక జెప్పి కరుణతోడ నిందువస్త్ర - మరువ కను మణులునిచ్చి మమ్ము దోలినావు తల్లీ ॥క॥ ఇంతినీవు ఖేదమొంద కే- దిక్కుతులెల్ల సంతతమున జింత నొందుదురె - యంతటను వెలసినావు ఆది పరంజ్యోతివమ్మా - పంతముతో జనులు కొంత భాగ్యముల నిచ్చి నారు ॥క॥ సవతి నీకు సేవచేసెనే - నీమీఁద నెంతో చాలగను భక్తి జెందునే - భ్రమను జెంది మదినిగుంది పలుకరింపబోకు చెలియ - క్రమ ముగా నీదువిభుడు కాంతు జెఁదునమ్మ వినుము ॥క॥ భద్రగమన భద్ర మిమ్మా। యాదవదాసు భక్తుఁడని భద్రమమ్మా। భద్రగిరి రాఘవుల శాయకను నుండి। వేవేగము నిద్రఁజెందు సముద్రునికిఁ బుత్రివమ్మనీవు॥

వ. లక్ష్మీదేవి యేమనుచున్నది.

గీ॥ వినుము ఓతల్లి యెఱుకల వెలది వినవె। భ్రమయు జెందెను నిన్నింక బాయలేను। నీవు పలికిన పలుకులు నిక్కమమ్మ। పోయిరావమ్మ యెఱుకలపోలతి వేగ॥

క॥ తడికలు గుమ్మలు తట్టలు। పిడిగిడు పులినేరుబరిగె బిబిర తెచ్చెగ గడియలో నల్లితినధికము। సిడిమాడినే పసుపువస్తి సింగినిఁజూడగఁ॥

సోదిగాడు వచ్చుట - కీర్తన

సోదిగాడువచ్చెను ఎఱుకిల సోదిగాడువచ్చెను - సోదిగాడు సింగిని జాడలో తిరుగుచు - వాడల వాడల మహా వేషకతోడుత ॥సో॥ నల్లాని మొగముతోను వంకబొట్లు తెల్లగ మెరయుగాను - చిల్లులు పోయిన చింపూల గొంగడి - అల్లాన నడుమూన అట్టె చుట్టుకొని ॥సో॥ కోతిని ఆడించుచు పిల్లగాండ్రమూతులు గరపించుచూ - ఖ్యాతిగ కుక్కలు ఘనముగ బొర్లగ - చేతితో కట్టాలు ప్రీతితో నల్లాచు ॥సో॥ పుట్టగోచిని పెట్టుక వంకకత్తి బొడ్డున సవరించుచు - పుట్టచే దేహంబు చెడ్డనాసన గొట్ట - బుట్టయూగులాడ బిడ్డాను యెత్తుక ॥సో॥ సింగిర మ్మని పిలుచుచూ - తేపకువాడు చీర పేనులు గ్రుక్కుచు - పొందుగ భద్రాద్రి శౌరియటంచును - రంగుగానిలమీద నటు పొర్లుకుంటాను ॥సో॥

వ. ఆ సమయమున సింగిని యేమని పిలుచుచున్నాడు.

యాలలు॥ సింగి నీవు నన్ను విడిచి చెంగున గంతులువేసి - ఎందు బోయినావు చెప్పవే యాలవోలయ్యా-సింగి నీవెందు బోయినావెచెప్పవే॥ సింగి నీవు పిలిచెదవు అంగనాల యింటికి - పొంగుచూను నెఱుకలఁ జెప్పితి ఓ ఆల వోలయ్యా - బంగారుసొమ్ములు యిచ్చిరి - బుట్టాచం కాను బెట్టుకొని పిట్టలాను దెచ్చినాను - వేగను వండిపెట్టవే ఓ ఆల వోలయ్యా - పెట్టకుంటె పారవేసేదా - అట్లే గుడ్లువిడిచి పిట్టలెందు కురా నాకు - ముట్టరాకు నన్ను నిప్పుడు ఓ ఆలవోలయ్యా - బంగారు సొమ్ములు నిచ్చిరి కట్టుకున్న చీర యిచ్చెద - నన్ను తిట్టుతావదేమే నిన్ను ఒకతో గూడుదు - కన్నులన్ని యెఱ్ఱజేసితి ఓ ఆలవోలయ్యా - నన్ను నొల్లనేమి చెప్పవే గొట్టెద నిప్పుడు - ముట్టరాని మాటలు నీ విపుడు గట్టిగా నను నొల్లరా - ఓ ఆలవోలయ్యా-వోరట్లులేదు ఇంటి కేగరా॥

గీ॥ ఏమిసింగి నీవు మెట్లెట్లు చేస్తావు। నిన్ను జూచి నాకు వెన్నువెరపు లావులేస్తువుంది రమ్మని పిలువవె। కోపమేల సింగి గొట్టలేను॥

గీ॥ సింగి నీవునన్ను చీరకెక్కడివంచు। ఆజ్ఞజేసెదాప్ర అరయ వినుము
ద్వారలవద్దనునేగి నరగున నడకగను। చెప్పవంటుకు నిండసేతువటరా॥

వాదము

బంగారుకుండ్ల పేరు చెంగావి చీరెవరికి ఎవ్వరిచ్చిరేసింగి - ఎవ్వరిచ్చిరే సింగి॥ పొంగలు తిరునాళ్ళకి నేను సంగతితో పోయిచేరె యక్షగానముగట్టిన్ని యిచ్చిరా॥ కట్లాలు దాపిన రత్నపతకముల సరులు శారదా దేవికి నెదుటా మేలుగాను జెప్పితేను కూర్మితోనునాకు నిచ్చిర॥ వట్టితన మేల చెప్పవె నవరత్నములు దాపినట్టి రంగైన రాణికి నెవ్వరిచ్చిరె సింగి॥ సత్యభామ రుక్మిణీ సవతులకు నెడక నేను సఖ్యముతోఁ జెప్పితే నేను పంచిపెట్టిరా॥ కన్నులుముక్కుకపయిండి సొమ్ములు ముత్యాల రవిక ఎవ్వరిచ్చిరె సింగి॥ పార్వతి గంగలను బిలిచి భక్తితోను నెదుటనునడిగి। గర్వమొందక నిచ్చినాడు॥ కండ్లముందర సింగి భామరో నీ మెడలో నున్న బన్నసరము ఎవ్వరిచ్చిరి! ప్రేమతోను చెప్పకుంటే భామా వల్లనే సింగి। అది రామభద్రగిరి - శ్రీరామచంద్రుల దేవి అంగనసీతమ్మయిచ్చె అదిగో చూడర॥

కీర్తన

మృగవేటకాడను నేనురా - నే ఘనము జెప్పెద వినరా - నగ వనములుదిరిగి నానామృగంబులు - బట్టుక నేను నిటుదెచ్చినాడను॥ మృగ॥ జింకలు తోడేలు చిరుత పెద్దపులులు - కొండనక్కలాను కొండ కప్పలాను - అంకెనికివచ్చె యేకెదుబ్బరిగాడు ॥మృ॥ వంకల వంక లేసి యీతచాపలు అడ్డము వచ్చెనేమిరా - నాబుట్టతో గొట్టుదు చూడరా- గుడ్డి కొంగలాను కుందేటి పిల్లాల గూడ్ల పగులనిచ్చి కూత పిల్లలును - బంగారు నీచలి విందపూళ్ళ గూళ్ళంగ - గూసేటి నిరుకక్కలాను॥ మృ॥ గొఱ్ఱె మేకలను నేబట్టువాడనే - బఱ్ఱెనక్కలాను గొఱ్ఱెదా - ఊరపిచ్చుకలను కారెనుబోతుల - మెఱ్ఱాంసల్లుని మెడ్రాదున్నలాను- గొఱ్ఱెపోతుల కఱ్ఱెతాకులాను సల్లానభద్రాద్రి స్వామిని దలచెద॥ మృ॥

చ॥ జయుఁడను నేను భక్తుడను జయమును జేసేటి ద్వారపాలుఁడా
భయమును బాపెదర వినర భక్తజనావళి మమ్మునొల్లగాఁ
ప్రియమున నారసింహునకు ప్రీతిగభక్తిగఁ బూజసల్పెదర
నయముగ నమ్మితిన్వినర నామది భద్రగిరీశు నెప్పుడుఁ॥

కీర్తన

విజయుడను వినరా జగములో వీరపరాక్రముడనురా - పాపములఁ బాసితి ; నారసింహులకు భక్తుడనే వినరా ॥వి॥ ద్వారమందు మేము స్వామిని కొలచుచు నెప్పుడును - హరిమితోడుత సేవప్రలేకను - కోరి భజించెదను ॥వి॥ పూర్వమందు మేమూ స్వామితోఁ బూని-యుద్ధమందు గర్వము జెందియు విక్రమంబున కడతేరితి వినరా ॥వి॥ శత్రువు వోఁగొట్టితిమి మేమిక చెలువుగ వినరోరి - పాత్రులమైతిమి భద్రగిరీశుని బాయకుండెదమురా॥

క॥ శ్రీలక్ష్మీనరసింహులు । పాలాక్షుడు నుతులుసేయ భక్తులుగొలువన్
లోలాక్షులు గంధర్వులు । వాలాయము బాడుకొనుచు వచ్చిరియిందున్॥

గీ॥ సకల ద్రవ్యంబులును మహాసమ్మతమున । జయము వేగంబె యిచ్చి
రక్షకముతోను । భేరిదుందుభి మ్రోతలుబెడిద మొప్ప । గజము
లశ్వంబు భటులును సగముగాను॥

కీర్తన

దేవదేవుడొచ్చెను - ముద్దుల నారసింహదేవుడొచ్చెను - శ్రీనారసింహులు శ్రీలక్ష్మితోగూడి - మానవులఁబ్రోచు మందరధీరుఁడు ॥దే॥ మకరతోరణంబులు భేరిమ్రోఁతలు - మఱిమఱి మ్రోయంగనూ - మకరధ్వజునితండ్రి యతివేగరథమెక్కి - వచ్చెచూడుడి యిలజనులందరు॥ దేవవరభద్రాచలవాసుని మదిలోనిల్పి కరుణ యాదవదాసుని - నిరువుగ వాసుల ఫలము నిమ్మనిచాల - నరగుసవేడుచు సన్నుతిసేయుగ ॥దేవ॥

ఉ॥ శ్రీనరసింహుఁడన్ వినర శీఘ్రమె వాదులఁ బ్రోచినాఁడనే
కాననమందు రాక్షసుల గ్రక్కున ద్రుంచి సురాళి నేలితిన్
దీనులఁబ్రోవ ధారుణిని దేజమెలర్పగ నుండువాడనే
భానుని దీప్తులన్ మెఱయు భద్రగిరీశుఁడ నారసింహుఁడన్॥

గీ॥ కరుణతోడుత భక్తులగాచినాడ । నుంటి గరుడాద్రియందునే నుచిత
ముగను । యాదవాఖ్యుఁడు భక్తుల నార్తితోడ । నమ్ముకొనియాడ
యీకథ మఱియు వినుత॥

కీర్తన

పరమ్ముగరూపుండ నారసింహుఁడనేను ద్వారపాలా - నేగరుడాచలంబున గ్రక్కున వెలసితి ద్వారపాలా - కోటిసూర్యులకాంతి మేటికోటము ద్వారపాలా - ఉక్కుస్తంభమున నుద్భవించినాఁడ ద్వార

పాలా - నేను ఐక్కలి తేజుడ చక్కగ విసరోరి ద్వారపాలా - కనక కశ్యపుడను ఘనరాక్షసుని ద్రుంచితి ద్వారపాలా - నేను బనిబూని ప్రహ్లాద భక్తుని గాంచితి ద్వారపాలా! సురలాను రక్షించి యసురులను ద్రుంచితి ద్వారపాలా - నే గరుడవాహనుడను తేర్చుచున్నాడ ద్వారపాలా - చక్రంబుచేత పరాక్రములను ద్రుంచితి ద్వారపాలా - నేను భక్తులను రక్షింప భద్రాద్రి జేరితి ద్వారపాలా॥

ద్వారపాలకుని మాట

క॥ విసరయ్య లక్ష్మీనాథుండ । కనుగొని నను నేలవయ్య ఘనభుజశాలీ ।
దనుజుం ద్రుంచితి వెందుకు । ననుమాపము లేక చెప్పడతి వేగముతో॥

ద్విపద॥ వినుద్వార పాలకా విశదంబుగాను - గసరోరి మాపూర్వ కథ జెప్పెదాను - ఆదిశేషుని పాన్పు నందముగ చెల్వ - పాధోధియందున వవళించగాను - దేవతల్ మునిజనుల్ దేవపాదుండు - భావమ్ములో బెదరి భయముచే వేగ - మావద్దకునువచ్చి మతియునిట్లనిరి - దేవాదినాథుండ దీన దయాళు - భావజశృంగార పరమాత్మ దేవ - కనక కస్యపుడనుఘనరాక్షసుండు వినువేగ తపమును విశదంబుగాను - బ్రహ్మనుగూర్చియుఁ బదపడి చేసె - బ్రహ్మవరంబులు బాగుగానిచ్చె - నధిక బలవంతుం డారాక్షసుండు - హత్తితో సురుల వెదకిద్రుంచెనయ్యా - యనగానే విని నేను యాజ్ఞ నిచ్చియును - పనిబూని తోలుతను త్వరగవిసరోరి - వరభద్ర గిరియందు వసియించినాము - నరసింహ దేవుడ నా పేరువిసర॥

గీ॥ దేవదేవేశ తెరవెళ్లు దీనపోష । భావమందున దలతును భవ్య చరిత । నీదు చరితంబు చూచియు మోదమాయె । భద్రగిరివాస నరసింహ భయవిదూర॥

క॥ గరుడాచలవాసుడ నను । సరగునను సరసినావు సన్నుతి జేతుఁ
గరుణతో యాదవదాసుఁడు । సరగున మీకథను జెప్పి సన్నుతిఁ జేసెఁ॥

తెరవెళ్లే కీర్తన

దేవానారసింహ దేవా - దేవదేవుడను దీనుల బ్రోచిన భావజజనకుడ పరమదయాళుడ ॥దేవా॥ దీనరాక్షససంహారా - మేరుసుధీరుడ భూరిపరాక్రముడ ధారుణి భారనివారణ జేసిన ॥దే॥ భక్తులకంసారి - గౌరీమనోహరు కరుణతో వేడగ విభవము చేతనువిసరానా పేరు॥ దే॥ శూరా జగదేకవీరా - వారిజనేత్రుండ నారసింహుండను కూరిమి భద్రగిరి జేరినవాడను ॥దేవా॥

ద్వారపాలకుని మాట

గీ॥ లక్ష్మీనరసింహ దేవ మీలక్షణములు । జూచినంతలో నామది
చోద్యమందు । వ్రజమై యూర్యరత్నము ల్వాడుసతోను । తెలుగు
చున్నాడు వీరెవ రెఱుక చెప్పుమా॥

గీ॥ వినర ద్వారపాల అనుమాన మేలరా । కనుము నీవు నేను ఘన
ముగాను । మనసునొవ్వకుండ మాటిసేగ జెప్పెద । ధనమువల్లి కెల్లి
లెఱుగలక్ష్మి॥

వ. స్వామీ మీరెవరు.

ఉ. ఈసతి నాకు భార్యయయి యింపుగ చరింపగ లక్ష్మియనా మొరే
భూసుర శ్రేష్ఠులున్ సకల పుణ్యచరిత్రులు లోకమాన్యులున్
వాసవదైత్యులున్ యతులు వాల్మీకి మౌనియు బ్రహ్మదేవుడున్
మోసముబోవ జేయుసతి మోహము నీవగ మెల్లనింతె రా॥

వ. స్వామీ మీరెవరు ।

గీ॥ దేవగంధర్వ స్త్రీలురా దివ్యముగను । సరససంగీత నాట్యముల్ సల్పు
కొనుచు । నుందు రెప్పుడు నాతోను నూర్జితముగ । భవ్యచరితముల్
వినువాడు భాగవతుడు.

విజయుని మాట

సీ॥ రాజమహారాజ రాజతమృదుపాద రాజిన్మహారత్న రాజరాజ
రాజీవనేత్రనీ రాజ్యమెక్కడనయ్య పూనిచరించేటి పురము యెచట
వసించుచుందువు ఎక్కడవిహరింతు వెతిగించుమీ మాకు నెలమితోడ
భక్తవత్సలజగ ద్భావంబు నెరిగితి నాదైవరూపులు నరవరేణ్య
గానిమీమ్ముల వేడెద కరుణతోడ । కోరినటువంటి వరములు కొసుప లేక
దయను చేయుడి మ్రొక్కెద ధరణిశేజ । భద్రగిరివాస నరసింహ
భయవిదూర॥

కీర్తన

వాసవార్చిత నారసింహా మీకు వందనంబు – భూసుర శ్రేష్ఠుక
పుణ్యచరిత్ర – దాసులనేలిన దయువిధేయుడ వీవె–వాసవదినమణి వంశాబ్ధి
చంద్ర – ఓదివ్యమోహన గుణసాంద్ర – వనధి గంభీరుండ వందనంబులు
నీకు – అనుమానమేమిటికి ఆర్తశరణ్యుడ ॥వా॥ దశరూపధరుడ నీవు వేగ–
విశదముగను బ్రోవరావె – శరభవిక్రమ పశుపతినుతహరి – వశము చేసి

కొమ్మ వారిజనయన ॥వా॥ ఎంతో శృంగారంబులిటు - బహువింతలసొమ్ము లున్నవి - చింతబాపెను భద్రశైల రమేశుడ - కాంతుల భక్తుల కాపాడి రక్షించు ॥వా॥

వ. ఆసమయంబున నరసింహస్వామి నేమనుచున్నాడు.

క॥ వింటిర మూచ్చటలను నే। కంటిని సద్భక్తిపేరి కరుణాతో నిప్పుడ్
వెంటనె మోక్షములిచ్చెద। నంటనిరయాయనుజులకునను సమ్మరదస్నే॥

కీర్తన-వినరోరివో ద్వారపాలా నీవు-విన్నవించెద గుణజాలా-కనరోరి నా ప్రజ్ఞ ఘనభుజబలుడను - కనకాక్షునేనొక్క గడియన ద్రుంచితి ॥వి॥ శ్రీరామచంద్రుడనైతిని నేనుసీతనుబెండ్లాడితిని - భూరిపరాక్రమభుజబల హితుడాను-శూరుడ రావణాసురుని ద్రుంచినవాడ ॥వి॥ వసుదేవసుతుడ నేనైతి గొల్లవారిజనేత్రుల గూడితి-అసహాయసూరుల నసురరాజులబట్టి కంసునిద్రుంచినే ఘనుడనై వెలసితి ॥వి॥ పదునాలుగు లోకంబులు వెల సితిని - నేను భద్రాద్రియందున జేరితి - ముదముతో దాసుల పదపడి నేలితి-వదలక యాదవ పదులతో। గూడితి ॥విన॥

ద్వారపాలకని మాట

గీ॥ దండువారలు నరసింహ దయవిధేయ। పూజసలిపెద లక్ష్మీశ భ వపచరిత। వరములిచ్చియు రక్షించు వరద యీశ। పరమపదమిచ్చి యేలుము పరమపురుష॥

కీర్తన-నవరత్నపీఠంబునా శ్రీనరసింహ నయముతో గూర్చుండుమా-పుణ్యాచారిత్ర శ్రీపురుషోత్తమాహరి - భవబంధమోక్షక భక్తవత్సల వేగ ॥నవ॥ గంధర్వకన్యలు నాట్యముసలిపి గానంబుమృదుభామంబులు-సందేహమెందుకు సర్వసేనలు గొలువ - మేరుధీరుని నీకు వందనమును సేయు ॥నవ॥ ఎంతో శృంగారంబులు చూచితె రతికాంతుని ప్రభ జెందెనూ - వింతవింత రంగులెం తెంతో కనుపింప - మంతుకెక్కినయా వైకుంఠమిదియా యన। ధిమిధిమిమద్దెలలు తాళంబులు క్రమమూన వెలుగంగనూ। అమిత ప్రకాశుడ హరిభద్రాచలదేవ భ్రమజెంది యాదవభక్తులు గొలువగ ॥నవ॥

వ. ఆ సమయంబున నారసింహులు సింహాసనంబున వేంచేసి తదుపరి లక్ష్మీదేవితో నేమనుచున్నారు.

చ॥ చతురతపొందగా నిపుడు చంచలనేత్రిరో వేటమార్గముల్
హితముగబోయివత్తు సతి యింపు దలిర్పగ నాజ్ఞ యిచ్చినన్

ద్రుతమతి తోడుత నన్నకల దుర్జనరాక్షస ముఖ్యసంఘముల్
హతమును జేసి వత్తునిక నంపవె వేగమె ప్రేమతోడుతన్॥

క॥ అదిగాక విన్ను విడిచియు । ముదితరో నేనుండగలనె ముందర సేనల్
పదపడి బాయుదు క్షణములో। మదవతి నేమగుడి వత్తు నతి వేగమునన్॥

సీ॥ దేవాదిదేవ ఈ తెగువ మెందుకువచ్చె నెన్నడు లేనిది యెందుకయ్య
వేటాడబోవుట యెన్నడు నెరుగము మనకిది తగదయ్య మనుజనాథ
అదిగాకమీ వెంట నటు సేనలుండగ తోలించు వేగమె తోయజాక్ష
దైవరూపులు మీరు దాసులందరు గూడి పూజ సేతురు నీకు పురుషవర్య
గానమిమ్ము వీడియుండు నాగడియ యైన నిముషమే నేనరసింహ నిన్ను బాసి
యుండలేనయ్య వచ్చెదనుర్వినాథ । దిగులు పుట్టెను నామది దీనపోష॥

కీర్తన - వాదము

వేటమార్గంబున వెలదిరో పోయివత్తు ఆదిలక్ష్మి । నన్ను మాటలాడగాను మన్నించితో లవే ఆదిలక్ష్మి । ఇటువంటిబూటక మెన్నడు చూడను నారసింహ - నీవు కుటిలతలంబున హటము జేసెదవేమి నారసింహ॥ హటమేల నాతోను అంపవేనన్నిక ఆదిలక్ష్మి - నేచిటుకూన మృగముల తటుకున బడవేతు ఆదిలక్ష్మి॥ మృగవేట కాదని ముందు తెలియలేదు నారసింహ - నన్ను పదపడి మీకిచ్చి పగజేసి మాతండ్రి నారసింహ॥ పగయేమి జేసితి భామరో నీతోను ఆదిలక్ష్మి-నన్ను నగడు జేసి మాటలాడేవు యిది యేమి ఆదిలక్ష్మి॥ మాతండ్రి సముద్రుడు మఱచి నీకిచ్చెను నారసింహ- నేను ఏతంత్రమెఱుగక యీతీరునై తిని నారసింహ - యిచ్చితె నేనేమి హెచ్చుమాటలంటి ఆదిలక్ష్మి - నేను వచ్చి నిన్నడిగితి వంచనసేయకు ఆదిలక్ష్మి-బలిమి నన్ను చెయిపట్టరాదు మీరు నారసింహ - మీరు వలదని యింకొక వనితాను దెచ్చుకో నారసింహ॥ అటులౌనె దెచ్చితె ఇటుల అందువు నీవు ఆదిలక్ష్మి - ఓ బాలామణిరో పంతమెందుకె నీకు ఆదిలక్ష్మి-పంతమేల నయ్యాపది వేలగండాలు నారసింహ-బహు-చింత చేయుందు చుచిన్నబోయి యుందు నారసింహ॥ వేటకే పోకను ఎన్నాళ్ళు వుందునె ఆదిలక్ష్మి-ఓబోటిరో కోరిక నాటింది మదిలోన ఆదిలక్ష్మి॥ పొమ్మన వలదయ్య బుద్ధిచలింపదు నారసింహ - ఇక పమ్మతిగను భద్రాచలవాస మ్రొక్కెద నారసింహ॥

వ. అదివిని నారసింహులు డేమనుచున్నారు.

పంచచామరము

మృగములన్ని నగములోన ముందువేసి ఫలములన్
పగలురాత్రి ప్రజలు వేగ పలవరింపుచుండగాన్
వగలుచెంద జనులు మిగుల పొగులుచుండగా
దిగులుయేల వచ్చెదింక యిందువదన పోయెదన్॥

పంచచామరము

నన్ను నడుగుటేమి నీకు నున్నకోర్కెలన్నియున్
తిన్నగాను దీర్చుకొంటి నిన్నిమాటలెందుకె
నన్నునిచ్చె తండ్రి నీకు నల్లుడంచు వేగమే
యిన్నివ్రాత ఫలములన్ని యెన్నమాటలెందుకే॥

అలుగుట ఫలమేమేలత్మ్మి అందువత్తు వేగ చలముయెందుకె సాగదోలవే నన్నుతిజేసెదవు। సాగదోలుటేమి నరహరి చాలును స్నేహము బాగుగ జేసితిని బ్రహ్మ వ్రాతయు బాపలేము సుమ్మి। బ్రహ్మవ్రాయుటేమి నాతో పగయెందుకు చెలియ - గహ్వరంబులు తిరిగి వచ్చెద కరుణతో పోనియ్యవే। పొమ్మనుటేమింకనునాతో పొందునీకేమిటికి - దిమ్మరివై నీవు దేశములన్నియు తిరుగమరిగినావు - దిమ్మరినై తేభామ తిన్నగనీకెవరు సమ్మతితోడ నున్నారు జెప్పవే స్వామిసాక్షిగాను- నున్నవారిపేరు నీవికతిన్నగ వినవయ్య - ఎన్నిచెప్పినమీరు వారితో గెలిచెదరా - నన్నుమించి జగములో నున్నవాడెవడు చెప్పె - చెన్నుమీరగా చక్రముతోటి ఖండించెద వినుము - నీలవర్ణుడయ్య దేహము నీరజాక్షుడయ్య - ఫాలమందున కస్తూరితిలకము బాగుగ మెరయునయ్య ॥ఇంక యెట్టివాడె పురుషుడు ఇందువదన చెపుమ - బొంకులేకను నిజముగ జెప్పవే పంకజాక్షినాతో ॥ కోటిసూర్యకాంతి మెరయుగాను మేటికిరీటము - హాటక మణులు శంఖచక్రములు అమరవినుతుడయ్య॥ అంతపాటివాడా నామము అతివరో చెప్పగదె-చింతయేలను చెంతకురానిక చంచలాక్షివినవె ॥పేరునడిగితిని నరహరి పేరువినవయ్య - ధీరుడు జగములో నేకవీరుడు దేవుడువినవయ్య - ఇట్టి వాడు నీకు చెలియ యెన్నడు గలిగెనో - పట్టి వధించెద కన్నులబడితే పారిపోయెనే - పారిపొయ్యే వాడుకాదు పరమాత్ముడతడ-దూరముజూడు గెలువలేరు మీరు దుడుకులన్నిపోవు। పణతిరోనీ వెంతో నేను పతివ్రతననుకుంటి - కడగి

యుద్ధము నాతో జేసెటి కాంతుడుండెనీకు - చిత్తమెంతనీకు నరహరి
చంచలమైనది - మంపుకెక్కిన భద్రాద్రిశుభ వాదమేలనాతో॥

వ. స్వామి యోచించుచున్నాడు.

ఉ॥ [illegible] తెప దయా [illegible] నేటికి నాటికి నీదుధర్మము
[illegible] నంచుబల్కితే
[illegible] వచ్చుటేమిసన్
[illegible] పోయివచ్చెదన్॥

వ. లక్ష్మిదేవి యోచించుచున్నది.

చ॥ ఎందుకు మాటలాడెవు వగచుచు వేగమె నారసింహ మా
యందున నేర మేమిగల దంచువచించెదు బుద్ధినుండగన్
పొందులు పొందుకయ్య మతిపోయెదనంచును నిగ్రహించియున్
కందుకమాటలాడెదవు కారణమున్నది ప్రాణనాయకా॥

సీ॥ [illegible] లక్ష్మి నాతోడను ఇంత పోరు। మొగుడివత్తును వేగంబె ముంద
గమున। విన్నపాలను [illegible] నిలువగలవ। సాగవోలనె వేగం
వెళ్ళున్నా తాంగి॥ కీర్తన - వాదము

ఏమి సేతుదు ప్రాణనాథా - మిమ్ముఎట్లా వోలుదు గుణశీలా - ప్రేమతో మీరాకేమొ సయ్యనమయితిరి వేగ - నామనోహర మిమ్ము నమ్మి తోలగ చేసు॥వ॥ శ్రీలక్ష్మినీ కేమిచింతా నేసుశీఘ్రంబెవచ్చెద చెంత లోలాక్షి కమలాక్షి లోకమాతవునీవు - ఏలభేదమునీకు వేగిరమునవత్తు॥ శ్రీలక్ష్మి- దండకాటపురోమీరాటు యిట్లాలెగద చరించబూనినాదు - కొండబిలములు నిండుపోదలుజూచి - గుండెలోజడిసుకు దండమిదిగో మ్రొక్కెద ॥ఏమి॥ అంత చరియించెదాను జంటవధజేసి వచ్చెదాను - అనుమానమెందుకు నంపవె శ్రీలక్ష్మి - ఘనమైనమ్మార్గముల ఖండించివచ్చెదను - ఈ చుట్టు కొల్లాపురి గటు - యడవి చెట్టుల చెంచుల మొట్టు - పట్టవచ్చెదరయ్య పరము దూతల వారు - ఎటులవచ్చేదరయ్య ఏమిసేతునిక ॥వ॥ బాణ జాలంబుల నేనువో పణతిరో-బహుగ నేపడగ వైదాను - రాణమునా వెంట రమ్యంబుతో రాగ - రాణించు నారీమణిని ప్రేమించెదానూ ॥శ్రీ॥ చెంచు ఫనిలి చక్క దనమువిూరదు - ఎంచబోకుడు మ్రొక్కెదానూ - వంచి వేతురుగాని వారిజాక్షులజూచి - మంచిగా భ్రమజెంది మరియిందు తేకండి ॥వ॥ యేకనారీ వ్రతుడనేనూ - నాకుయెందుకె చెంచులతోను - పాకారిపదవైన పణతిరో నొల్లనిక - నీకోసమై నేను నీరజాక్షిరోవత్తు

॥శ్రీ॥ నమ్మ లేనయ్య నీమాట వేగనమ్మిక కల్గియిచ్చోటా - నమ్మరో మీరిక సరగునరాకుంటె - కమ్మవిల్తునిబాణ ఘాతలకునె నోర్వ ॥వ॥ బానలిచ్చెద నీకుపడతీ చెంచునివాస మునకు నేబోవుసుదతీ - భానుడుల సాక్షిగా పూబోణిభద్రాద్రి - వాసుడను [illegible] ॥శ్రీ॥

వ. అనుచుదయుంబున విజయునితో లక్ష్మీ [illegible]

గీ. భ్యాగపాలకా విజయుడా తగవు వినుమా । మంత్రివై యుం[illegible] నరహరి మాటవినుము । వేటమార్గంబు నేబోయివేగిరమున । వత్తునని యనుచును న్నాడు వదన వినుమా॥

వ. విజయ డేమనుచున్నాడు.

గీ॥ ఆదిశక్తివమ్మ అతివచక్కనిబొమ్మ । కొమ్మయూదని తల్లివమ్మ నీవు । చిన్నబోకమరాళ చెప్పెదమీ మీవా ర్త । కవిమ్మవాయుతల్లి సమ్మతముగ॥

కీర్తన ॥విజయుడయిక వినుమా నరహరి వేటమార్గమందు - త్రిజగములుమెరయ పయనమాయెను తెలుపుజెప్పుమాకు ॥వ॥ ఏమిచెప్పుదును నరహరిమొందుబో తేమి-భీమపరాక్రముండు దేవనాతో శీఘ్రయేల చెప్పుమా॥ నన్నువిడిచితాను నడవికినరిగినాడు వినుమా - యన్నాడు గృహములో మన్ననజేయుచు నెన్నిచెప్పుదునూ ॥వి॥ ఎక్కడికేగెను హరిగృహములో నెటుల నుండునమ్మా - అక్కడ మాటల నాకుటమీకు నందముగా దమ్మా ॥మంత్రివై నీవుమమ్ముల మాటలాడుతావా - తంత్రము నీవుచేసిన తంతులునాకు తెలియుసుపోరా ॥ ఏమిచేసినానుమిమ్ముల నేమియంటినేను- స్వామికార్యము జేయకున్నను స్వామిద్రోహుడౌను॥ ఉభయు లేరీతి పడకకయున్నారు నావెంట । యుఖిమతిజేయుచు నరహరినిపుడు పంపద లచినాను నేను । వారితో నేను నరహరి నేగుమంటినానా । కానిమాటలు నన్ను నడుగగ కారణమేమందు॥ పటపట మాటలను జెప్పవే లెక్క జేసి । కుటిలముదలచియు స్వామినాలో కొట్లాడుటజేసి॥ ఇంతకోపమేలా లక్ష్మి యిప్పుడునరహరి । పంతముతోడుత కరముబట్టియు పదమునక్కై బలుకు । వేటకువలదనుచు జెప్పుము వారిజాక్షునికి । వేడగ లక్ష్మినివిడిచి పోవుట నీతిగాదుమనుమీ॥ అటుగాదు మాతల్లి యడవి మృగములన్ని । చెట్లవాసినూ పండ్లు ఫలాదులు చెదరవినుమా॥ యేమిసేయునోయీ విజయుడ యెటుల నుండునోయి । స్వామినిబాసి నిమిషము నిలువ జేత గాదుసుమ్మి॥ ఏమి చింతలమ్మా భద్రాచలేశుడు వేగమున । భామిని యాదవ దాసుని నేలెడు భక్తుడనుచు వేగ॥

వ. ఆసమయమున లక్ష్మీ నారసింహులతో నేమనుచున్నది.

గీ॥ స్వామి వేగంబె రావయ్య సన్నుతింతు । రాక యుంటేను ప్రాణ ములే రాతిసారి । నిలువలేవయ్య దినములు దీవులేని । నిమిషమే డౌను నరసింహ నిలువజాల॥

క॥ ఉండుము వచ్చెదవేగమే।సందేహము లేదు చెలియ సరసము తోడన్। పొందుగవత్తును చింతను । జెందకు నీ సాక్షిసుమ్మి చంచలనేత్రీ॥

లక్ష్మీదేవి - కీర్తన

అల్లియుండక రమ్మి నా ప్రాణనాథా। ఎటుల నుందును వేగ రమ్మా । గట్టిగ మీ పాదంబులు చేపట్టిన నామదిలో నిప్పుడు । చెట్ల మీద పిట్టవలె చెంచులు వున్నారు సుమ్మి । వలపులు నిలుపుసుమ్మి యా చెంచితలు వలలో వేతురుసుమ్మి । చలముతో మిమ్ము వేరుకులములో కలిపెదరు । ఫలములు యిచ్చెదరు పణతులు మాయచేత । మతముదప్పి పడకొసుమ్మీ-ఈ వనితలాది గుణము మిక్కిలిగరమ్మి । అలమునాకులును పెరికి పొదలోన తింటు కారుపులులు దుప్పులు పెద్ద పులులును దెమ్మ నెను । జోడు నమ్ములు వేతురా వనితలు ఈడువాండ్లను జూతురు । గూడెపు చెంచులు వారు జోడుగూడి వచ్చెదరు । చూడవేగ భద్రగిరి సుందర శ్రీనారసింహ॥

వ. ఆదిలక్ష్మి యేమనుచున్నది.

ఉ॥ చెంచుల జోటులందఱును చెల్వగ నుందురటంచు బల్కెదన్
గొంచెపు స్త్రీల జూచినను గోమలియంతట నాత్మమెచ్చునా
కాంచన రత్నసంఘటిత కంకణముల్మెరయంగ హారముల్
మించి వెలుంగనీకుసరి మేదిని నెవ్వరు ప్రాణనాయకీ॥

వ. ఆ సమయంబున నారసింహుడు వేట మార్గంబునకు పోవు నెటువలె ననిన,

చ॥ రథమును నెక్కె శ్రీహరియు రమ్యతరంబుగ బాణహస్తుడై
పృథివ దరంగ తల్లెనిక పున్నమచంద్రుని తేజమొప్పగా
నతిరథ శ్రేష్ఠులున్ భటులు నందముగుల్కగ సర్వసేనలున్
హితమతి తోడుతన్ నడువ నింపుచలింపగ దండకాటవిన్॥

కీర్తన

కొండబిలముల నుండు పొదలను జూచి । దండి వ్యాఘ్రుంబుల ఖండించి వేసెనా॥ మెండుగ దానవుల గుండెలో బాణములు । నిండుగా వేసి తా ఖండించె నపుడు॥ ఘన సింహశార్దూల గండ భేరుండముల పని బూనిద్రుంచె శ్రీ పరమాత్ముడపుడు ఝిల్లీమృగంబుల జెల్లించి బాణముల । మెల్లగ సంధించె మేదినీశ్వరుడు కంఠీరవంబుల ఖండించె భద్రాద్రి కుండలిశయనుండు దండి బాణములా॥

ద్విపద

అటుతరలి నరసింహు డావనములోన । పటుభుజశాలియై పరువు బట్టుచును । చంపక పున్నాగ జాజివృక్షములు । బిల్వవృక్షంబులు పిచుమంద తరులు । గంభీరమైనట్టి కాంచనతరులు । ఖర్జూర వృక్షములు ఘనమైన వనము । హింతాల వృక్షములు ఇంపొందుచుండు । అంతట ఘనమైన యంజనాతరులు । సాల వృక్షమ్ములు చాలగాగలవు । ఫలములు పుష్పములు భరితంబులగుచు । తాలవృక్షంబులు తరచుగాగలవు పక్షిజాతులు చాల పలుకుచుండు । రాయంచ శుకములు రామచిలుకలును । నేయించ దగినట్టి నీలకంఠములు । పాల భారద్వాజ పయిడి కంటెలును । చాల గాపికములు సంతసిల్లుచును । కోవెలలు తుమ్మెదలు గుంపుగా మ్రోయ । పావురంబులు బాగ పై తిరుగుచుండి । ఈరీతి జూచుచు నినవంశనాథు । సారమైనట్టి యీ సరస ఫలాదు । లనుభవించుచుండె నారసింహుండు । ఎంచశక్యము గాని వెదురు ఆకులును । కాంచుచు భద్రాద్రి కమలనాభుండు । మంచిగా చెంచితపురి చేరచూచె॥

ఉ॥ శ్రీరఘు వంశరత్నమగు సీతను పావనలోక మాతయున్
ధారుణి బ్రోచినట్టి మరి తామరసాక్షు తలంచినట్టి యా
మారుని తల్లినిం దలతు మంజులభాషిని మందగామినిన్
కూరిమితోడ భద్రగిరి కుంభినినాథుని దేవి సీతనున్॥

కీర్తన

వచ్చె చెంచిత వేటలాడగా । ఇట్టి వైభవోన్నతమేడ చూడగా । పచ్చబొట్టును బెట్టి । పారుటాకుల చీరెగట్టి । విచ్చలవిడి చేత విల్లునమ్ములు పట్టి ॥వ॥ కలికిపంద్రెండేండ్ల ప్రాయము - తొలకరి మెరుపులవంటి దేహము కులుకుగుబ్బలమీద గురుగింజ పేరులు అత్తరుగంధము జవ్వాజులు కారగ॥ వ॥ పచ్చతుమ్మెద కురులెల్లజారగా - మోముముమ్మారు చంద్రుని చేరగా

కమ్మలువింత్రైన సొమ్ములు – నెమలి పింఛములు కంఠముజుట్టు కొన ఓరజూపులుజూచి – కేకుచు వొయ్యారికల చానలమదను – పారిజాతపు విరులు భామకొప్పున ముడిచి – పేరైనభద్రాద్రి పతినితలంచును॥

కీర్తన

గరుడాద్రివాసుడ ఘనమేఘశ్యాముడ నారసింహా ♦ గరుడవాహన దేవ కరుణించి బ్రోచెడి నారసింహా ♦ శతకోటి భానుని తేజకిరీటము॥ నా॥ ఓసారసనేత్రిని చేరిరక్షించిన నారసింహా ♦ మణిమయకిరీట మకర కుండలధర ॥నా॥ ఓఫణిరాజ శయనుడ పరమాత్మరూపుడ నారసింహా ♦ కనకపీతాంబరకటి శోభిల్లగ నారసింహా ॥నా॥ ఓవనమాలికాధర వాస వాసవార్చిత దేవ నారసింహా ♦ విక్రమ తేజుడ వినుతి జేసెద నారసింహా॥ ఓ కరుణా విధేయుడ ఘనభద్రాచల దేవ నారసింహా ♦ హాటకాంబర ధార అయోధ్య పురవాస నారసింహా ♦ ఈ ధరణిలో యాదవ దాసుని రక్షించు నారసింహా ॥నా॥

ద్వారపాలకునిమాట

ఉ. వచ్చినవార లెవ్వరిక వారిజనేత్రిరో ముచ్చటాడగా
పచ్చని పండులాకులును పద్మసుగంధిరో పట్టితెమ్మనగా
వచ్చితె మమ్ముజూడు మరివాంఛతో జెప్పుమి నాదుకోరిక
ఇచ్చిక తోడుతగా మదిని మాత విధంబున నమ్మినన్నిలీ॥

ద్విపద

వినవమ్మవో చెలియ కనవమ్మనన్ను ♦ అనవమ్మ నీ ముచ్చటలు వినవమ్మ ♦ నన్నడిగితివమ్మ నాతిరో వినవె ♦ యున్నట్టు చెప్పెద నుచితంబుగాను ♦ అడవిచెంచులమమ్మ అతిమోహనాంగి ♦ పుడమిలో తిరిగేము పువ్వుబోణివినవె ♦ శ్రీహరినాయకుడు చెలియమాతండ్రి ♦ ఖండించిమృగముల వేటాడుచూను ♦ ఏము చెంచులమమ్మ యెలమితో మేము ♦ ఆకాశ మునదిరుగు పక్షుల్లనైన ♦ ఇలమీద బక్షైతుమే బాణములతో ♦ చెంచు హోబలుతల్లి చెల్లెంద్రుకలరు ♦ మంచిగా బంధువుల్ మరియున్న రమ్మ ♦ వేటాడవచ్చితిమి వెలదిరో మేము ♦ భద్రాద్రి పూబోణి సాక్షి మాయమ్మ,

ద్వారపాలకునిమాట

క. తెరవెళ్ళికొనుమముచ్చట, తరుణిరో వేగ్గంబచెపుమ తాత్పర్యమునగా
ఖురిపెంబుతో నేమందుగా, కరుణతో వేంచేయుమమ్మ కనకపుబోమా॥

తెరవెళ్ళే కీర్తన

చెలియ ఒయ్యారి ముద్దు చెంచుభామనోయమ్మ ♦ కలికిరో నవ రత్న కమ్మలోయమ్మ ॥చె॥ కులము చెంచువారమ్మ ఫలములు దెత్తుమమ్మ ♦ వలలు చుట్టుచు మేము పొలముపుగ దిరిగేము॥ ౧. కొమ్మరో మృగరాజును కొట్టెదను ♦ ఇమ్మరో వాలమ్ములు యంగివేసెదమో యమ్మ॥ ౨. రమణిరో ఒయ్యారి ముద్దుల రాజపుత్రినమ్మ ♦ నేమంబుతో మృగ స్తోమంబు ద్రుంచెద నోయమ్మా॥ 3 ఇంతిరో రత్నాలు దాపిన బంతిరోయమ్మ ♦ కాంతరో యీ చంద్రసూర్య కాంతి మించెనమ్మ॥ ౪. సంతసముతో డుత భద్రగిరి నరహరి ఇంతలో వచ్చి చెంత జేరెపో యమ్మ॥

వ. మఱియు నేమనుచున్నది,

కీర్తన

మంజులవాణిని చెంచితనమ్మా నాపేరు కంజాతపత్రనేత్రి వినుము♦ కుంజరంబుల గూరిమితోడుత భంజన జేసేటి భామామణిని ॥మం॥ వర బాణచయమును కరమునబూని♦మురిపెంబుతోడ కరపద్మమున కిన్నెర బూని ♦ కరమునవజ్రంబు బిరబిర మెరయగ ♦ సరసరయతివరో సరము గొట్టెదమాను ॥మంజు॥ గండభేరుండ మృగములబట్టి చెండాడినేను ♦ మెండైన సింహాములబట్టి చండకిరణ దోర్దండపరాక్రమ దండిమృగంబుల ఖండించెదను ॥మం॥ తిరిగివచ్చితినేను నిటుభద్రాద్రి సీతావరుని సేవించి వచ్చితినిటకు ♦ ధరణిలో యాదవ దాసుని నేలిన ♦ మురహరి గానము మరువక పాడేటి ॥మం॥

ద్విపద

వినవమ్మ వో చెలి విశదంబు గాను ♦ కనవమ్మ చెంచిత కమలాయతాక్షి ♦ మాజన్మ లక్షణము మఱిచెప్పెదాను ♦ భూజనులు నుతిసేయ బోలు నేయమ్మ ♦ ఏడుకొండలనడుమ యేకరాశియందు ♦ జోడునగములు గలవు జాడ వినవమ్మ ♦ దండకాటవిలోన ధవళాయతాక్షి ♦ నిండుగా కొలనులు నుండునోయమ్మ ♦ పద్మనాభునిపట్టె పట్టణముమీది ♦ పద్మాయతాక్షిరో తగవినవమ్మ ♦ పుత్రులు లేకనిను పూనిమాతండ్రి ♦ శత్రులజయశాలి చేసేరుతపము♦ఉపవాస వ్రతములు విపరీతములుగ ♦ చపలచిత్తుడు గాక చేసినేయమ్మ ♦ కమలవాసిని హంసగమన కూతురును ♦ విమల చారిత్రుండు విష్ణుదేవుండు ♦ అల్లుండుగావలె ననికోరితాను ♦ నల్లంబులోపల నొనరంగగూడి ♦ అంతలో శ్రీహరి యతిభక్తిమెచ్చి♦అక్షణంబున

శౌరి యతడనునీవు ♦ కోరినవరమిస్తి కొనితేవుమనిన ♦ సారసనేత్రుండ చనె వేగనపుడు ♦ వరభద్రచలపతి వరమునాకిపుడు ♦ కరుణతో పుత్రివై కలిగితివమ్మా॥

ఉ॥ చంచల నేత్రిరో వినవె చెంచులగూడుక వేటమార్గముల్
మించిజయించి బాణములమేటి మృగంబుల ద్రుంచి వస్తినే
యెంచవశంబుగాని పొదరిండ్ల జరించుచు జంతువెంబడిన్
మచ్చికవస్తినే చెలియ మావురి యిక్కడ కెంతదూరమో॥

కీర్తన

ఎలనాగ వినవె - బంగారుబొమ్మ - మావార్తమీకు చెలగుచు చెప్పెద వినుము ముద్దులగుమ్మా - కిలకిలమనుచు కలికి చిలుక పలుకులు వినినే యులికిపడితిని ॥ఎ॥ గండభేరుండపక్షి మృగము నిండుగ - కోవెలి దండి శరభసింహచయము - దండిభండన యాధ్వనులు చెలగగాను - నిండు బాణముల ఖండిలనేసితి - పాదటాకులచీర మెఱయుపై - పచ్చలును జూడగ - కుచములు మెఱయు - కీరవాణిరో మేముకరవాలము చేత ద్రుంచితిమి కోరిమృగంబుల ॥ఎ॥ ఢణఢణాయని భేరిమ్రోయ దర్పంబు చెందుదళములు - కూతలుకూయ కిణకిణ యనుచును కంచు తప్పెటలు ఝణఝణ యనుచును ఝంకృతిసేయగ ॥ఎ॥ ఇలలోను మేము తిరుగుచురాగ - మహానీయ యీవలలొడ్డుచు సేనలు పోగా - యాలలు అనుచును నెలమితో నమ్ములు - కలికిరో వేసితి కమలాక్షి నీవే ॥ఎ॥ ఎదుటమాకలు ప్రాకెడము ఇలమీదనుంచి వదలకయమ్ములు వేసెదము - ఆదరిక భద్రాద్రీశుడవేగమే - మదవతి యీదవ మాన్యుని నేలెను॥

గీ॥ పద్మనాభుని గూడెంబు పరగమాది । చుట్టుకోటలు గలవమ్మ సుంద
రాంగి । కొత్తలంబులు మిద్దెలు కొమరు మిగుల । రాజధాని యీ
పురిమాకు రమణి వినవె॥

క॥ పదివేల చెంచుగృహములు।ముదితరో యాతండ్రి దొరయు మోదము
తోడన్ । కదనము జేసెటిఘనులునుపదపడినా తాళమైనబలమున దెత్తు॥

వ. ఆ సమయంబున చెంచిత భటులతో నేమనుచున్నది.

గీ॥ వినుడి మీరింత సేనలు విశదమొప్ప।ఎక్కడెక్కడి కేగితిరెఱుగ జెపుడి।
వేటమార్గములన్నియు వేగిరమున। తెలియజెప్పుడి నాకును తేటబడను॥

గీ॥ విపిన భూములతిరిగెదు వేగిరమున।కొండబిలములు సాధించిగొప్పగాను వృక్షములు నెక్కి పక్షుల వేలకొలది । తెచ్చి యిక్కడ నిలిపేము నిశ్చితముగ॥

కీర్తన వాదము

వరభీకర శ్రీవరదా యెరుకులపద్మనాభ వినరా - మరియుచు నెక్కడ వేటకుబొయ్యేవు సరగు వినిపించుమా। పాయక మరి వినుమా వింధ్యానగరము చేరెదను। పాయక సింహాచలముబట్టి బాధ జేసెదను। ధీరతతో జెప్పుదు ఎఱుకలదేవుడ ఇకవినుమా - భారమునీదని జనకుడు దోలెను పరగజెప్పుమాతో - దొరకూతుర వినుమా నేను ద్రోణగిరికి బోదు - వరమరలేకను శరభవివహములు హతముజేసివత్తు॥ భంగపడక చెపుమా ధీరతతో దొంగరాముడవురా - సంగతిసేలుగూడుక నీవు చనిమొద వెక్కడకు॥ చెంచునాయక వినుమా నేను జెప్పెదవేగమునా- మంచిగనేను మందరగిరికి మఱియునేగెదను - తిరునామము మెఱయా ఎరుకల తిమ్మనాయకుడా - మఱచిపోయి నాతోనుజెప్పు మర్మభేదము లను॥ చూడుమి నాధీరత నేనిపుడు వేలాద్రికినేగి - వేడుకతో దుశ దండి మృగంబుల వేటాడెదనేను - భీతిలేదా నీకిపుడు తరపోతనాయకుడు - ఖ్యాతిగజెప్పుమి ఎక్కడకేగెదవు కడుప్రేమతో వేగ॥ సింహగిరినేగినే నర సింహులజూచెదను - గహ్వరంబులు తిరిగి మృగంబుల గడియలో ద్రుం చెదను॥ కాయమంతవలతి చెప్పెదవు కోమలిసిద్ధుడవురా - పాయక నెక్కడ బోయివచ్చెదవు పలుకుము వేగమున॥ పర్వతంబులు నేగినను బాణంబులతోను - సర్వమృగముల దొరకబట్టినే చంపివేసెదను॥ నాకు జెప్పవదేరా కోపనారదుండు వేగ - భీకరమై అడవులతిరిగి బిరబిరరా గలవా॥ ఇచ్ఛతోను వేగనేను మత్స్యగిరికిబోదు - వచ్చినమృగముల ద్రుంచివేసెదను వరుసతో పదివేలు॥ నన్నుగావగదేర నువ్వలచ్చేన్న వేగరార - నిన్ను వధించెదవేగ జెప్పుమి మన్ననచేయునురా॥ భద్రగిరికి నేగినే రామభద్రులజూచెదను ♦ క్షుద్రదానవుల ద్రుంచివేసెద జూడుమి నారద॥

గీ॥ వీగి మృగముల గొట్టేము వేగిరమున। గుట్టకోటలు వృక్షముల్ గట్టిగాను। వేలసంఖ్యలానుండును వెఱవవలదు। చెంచునాయకియాజ్ఞయు చెరుపవలదు॥

చ॥ గజములు తెల్లదుప్పులును గండభేరుండము సింహసంఘముల్
నిజముగ పుండరీకములు నింగికి నేగెటి పక్షిజాతులన్
త్రిజగము మెచ్చ సర్పములు తీరుగ బాణముబట్టి ద్రుంచియున్
గజబిజ రేపి వచ్చెదరు గౌరవమొందుచు పాయకమ్మరో॥

క॥ మన గ్రామంబును విడచియు। నను మానము లేక విపినమంతయు దిరిగెన్
ఘన పక్షులె మృగ రాజులు। విను వేగమె ద్రుంచవలయు విశదముతోడన్

క॥ కొండలు దాటియు మనమిక। మెండుగ బాణంబు వేసి మేదినిమీదన్
దండి మృగంబుల ద్రుంతము గండిక పోదాము వేగ రణమును జేయన్॥

కీర్తన - వాదము

హద్దు లేకనన్ను అంటావుమాటలు చెంచులారా - ఏ ప్రొద్దు బాయక మీరు నా వెంటనుంటారు చెంచులారా। చెంచునాయకుడును జెప్పిన ఆజ్ఞయు చంచలాక్షి-నిన్ను మన్నించి గదిసియు మరి వేటలాడేము చంచలాక్షి। అందర మొకదిక్కు అరిగితె మృగములు చెంచులారా - వేగ బెదరి భయము చేత బిర బిర దొరుకను చెంచులారా॥ ఏమిటనుచు చెప్ప వేగిరంబున బలుకు చంచలాక్షి - భామ గోసి మది బయలు వెతుకు తాది చెంచులారా॥ పదిమంది మీరు పని బాటకుపొండి చెంచులారా॥ నేను విదితంబుగ నొక్క వీటికి నేగెద చెంచులారా॥ ఇది యేమొ తెలియదు మొలనాగ నీమాయ చంచలాక్షి-నీవు పదమని మమ్ముల పై నాము జేసేవు చెంచులారా॥ చెప్పిన ఆజ్ఞయు చేసెవారలు పూని చెంచు లారా॥ మళ్ళీ చెప్పితె రెండింతు మాట మరచినారా చెంచులారా॥ వొంటిదానవు నీవు కంటకాడవిలో చంచలాక్షి॥ మాదు జంటయుంటె మరి మెటవచ్చేవు చంచలాక్షి॥ ఏమి భయము నాకు వేవము మృగముల చెంచులార - చెంచుభామ యెరుగ చెప్పేదిమేమిక చెంచులారా। జగమంత మోహించె చానమణివమ్మ చెంచులారా॥ వేగపగవాడు యెవడైన పట్టి యెత్తుకపోవు చెంచులార॥ వరబాణ గాయముల బాదించెను వాని చెంచులారా - మీరు సరగున నేగియు చంపుడీ మృగముల చెంచులార॥ మీకే తెలియునమ్మా మాకేమి తెలియును చంచులాక్షిమ్మ మేము శోకతో నీకథ రాజుకు జెప్పేము చెంచ॥ పోకుంటె ద్రుంతూను పోరేమిమీరిక చెంచులారా మళ్ళీ రాకుంటె రాజుకు మరి వేగ చెప్పాడి చెంచులారా॥ వరభద్రాచల వరదుండు రావచ్చు నన్ను తాంగి - వేగ కరుణతో యాదవ వరునిబ్రోచిన స్వామి చంచలాక్షి॥

వ. ఆసమయంబున చెంచుభటులు బాణాహస్తులై యేగిరి.

మ॥ పులులుం దుప్పులు నెల్లసింహచయముల్ భల్లూకరాజాగ్రముల్
లలనార్ఖిల్లి మృగంబులుం శరభముల్ లావణ్య శార్దూలముల్
కలయం దర్గుచు వనములో దుముకుచుం కంఠంబులం దాకుచుం
మలలుం దాటియు మార్గముం దెలియకే మార్పాటుతో వచ్చితిం॥

ఏమిసేతునిందు వచ్చితినో చెంచుభామా-ఏమిసేతునిందువచ్చితిని॥ ఏమిసేతునాదుతండ్రి యెంత వెదకుచున్నాడేమో - స్వామిసాక్షి యెట్లు పోదునో యో చెలియలారా ॥ఏ॥ మార్గమెంచు బోయెనో యమ్మనా తోడు-పెద్దదుర్గములో బడితినో యమ్మా-మార్గములేదంచు నెదుటమలలు దాటుచును వేగ - దురములో బడితినో యమ్మ నో చెలియలారా ॥ఏ॥ భంగ పడితి పడతి వినవమ్మ - నే నేమిసంగతైన యెవరులేరమ్మ - సంగతయా చెంచుస్త్రీలు సాగదోలి వచ్చితేను - అంగనమళ్ళి పోవ్మంటినో చెలియ లార ॥ఏ॥ ఇకనువినుమిా ఏమిసేతునోయమ్మ - మాతండ్రి అధిక ఆగడు జెంది తెగడుపనునమ్మ - పగలురాత్రి తెలియకను నుల్కిములలో దిరుగు చుంటి - దిగులునొందిదెగడుజెందితినో చెలియలారా ॥ఏ॥ గగనమందు ఘనముమెఱసెనే - జీమూతములు పొగయురీతి పొంగివచ్చెను - దిగులు బుట్టె మనసులోన పగతులెవ్వరో వచ్చిరమ్మ - ఖగములయి తెలియక నొచ్చె నేవో చెలియలారా ॥ఏ॥ నిద్రాహారముల బాసితి నిన్నటికాలము నేను నిందువచ్చితిభ-ద్రగ మన భద్రగిరి ప్రభుడునన్నునేలుగాక - అద్రిజ నాధునికి మ్రొక్కెదనో చెలియలారా ॥ఏ॥

కీర్తన

కూడవు చెంచులమ్మా మాజాడలెఱగవె ముద్దుగుమ్మా - వేడుక లలరగకూడిసర్పంబుల - దాటి కొలిచియు మేము దండించినాము ॥కూ॥ నరికిపొదలో నుంచి మేము - పులినిబడగొట్టి యిటువచ్చినాము - నరికి వేసితి మమ్మనాగసర్పంబుల - నురికియిటువచ్చితిమి ఊరెంతదూరమో ॥కూ॥ సింహ శార్దూలములను బట్టి తెజమ్మున నేలనుగొట్టి - గహ్వరంబులు తిరిగి శారడవికే తెంచి - జిహ్వాలుగోసితిమి జీవరాసుల నెల్ల ॥కూ॥ భద్రగమనరోమమ్మ జూడు - వేగభద్రాద్రికి పోయివచ్చెదము - భద్రంబు లిచ్చున పణతిరో మాకిక - క్షుద్రదానవులను మర్దించినారము ॥కూ॥

వ. ఆసమయంబున నరసింహదేవుడు.

క. సంపెంగపొదలమాటున । తెప్పుంతోమెరయంగ సాగ తేజముతోడన్
సొంపుగ మణులను దాచిన । నింపగు బంగారుజింక నెటువచ్చెనహో॥
చ॥ ధగధగ తేజమందుచును దండిగసూర్యుడు ద్యోతమానమో
యిగ శశిబింబమో మఱియు నింపు మరీచులు తళ్కు చూడగన్
గగనము గప్పెనీ తెలివి గంధిను బాహుడు వీణదోడనే
నగు మొగమెందుజూడనిక నమ్మిక లేకయు నెట్లు తెల్పుదున్॥
సీ॥ అరుణ కాంతులు మెఱయ నాదిత్యరథముపై రాణించి వెలిగేటి రత్న
మేమో అదిగాక మదనుని హస్త యుగంబుల బాణమో పువ్వుల బంతి
యేమొ అదిగాక యింద్రుండు వదలిన వజ్రంపు కాంతియో నవరత్న బంతి
యేమొ ఫణిరాజు శిరముపై పదపడి వెలిగేటి మాణిక్యమో గాక
గీ॥ మఱియ దేమొ । అదియుసిదియుగాదు అంబరంబున వెలుగు మెఱుగు
తీగెనుబోలె మేనుచాయ । పదమునందెలు గదలంగ పద్మగంధి
పొదలచాటున నిలిచెగా పువ్వుబోణి॥

వ. ఆ సమయంబున నరసింహదేవుండు దగ్గరకు బోయినిలిచి యేమను చున్నాడు.

చ॥ కమలదళాక్షి నీ ముఖము కాంతులు నీ నెడు నెవరిదాన వే
విమల సుగంధి నిన్ను సృజించిన బ్రహ్మయు నెంతధన్యుడో భ్రమ
యను జెందునే చెలియపల్కుము చిక్కులకొల్కి వేగమే
సుమశరు పువ్వుటమ్ములకు సాక్షి తివింకను తాళజాలనే॥

కీర్తన

ఎవరిదానవె ముద్దుగుమ్మా । నిన్ను నేమందు నే పసిడిబొమ్మా ॥ఎ॥ అవనిలో నీవంటి యతి సుందరినిగాన । నవ మోహనాంగిరో నాతోను జెప్పవే ॥ఎ॥ ఎంత చక్కని మృదుహాసు । నాతో పంతమా నీవు దాచే దావు । కాంత రోనిన్నిక కౌగలించుకొందు । నింతి రోమదనుని రంతు నకు తాళనిక ॥ఎ॥ కారడవిలో దిరుగుటేమి । నన్ను కన్నుల జూడవ దేమీ । నేరమా పారమా కూరిమిరాదేమి । నీరజాక్షిరో మరుని బారికి తాళనిక ॥ఎ॥ ఎట్లు పుట్టించెనో బ్రహ్మనిన్ను - నేమని యనరాదు జిహ్వ-ఇట్లు దిరిగినీవు గట్లు నెక్కుచువచ్చి - మాట్లాడునాతో మాణిక్య ముల బంతి ॥ఎ॥ ముత్తాపు రత్నాల రవికె - నురము గుమ్మచును నా మేనువణకె - మత్తే భగమనకో మెత్తని దేహంబు - సత్తుగ పూజింతు పుత్తడి బొమ్మరో ॥ఎ॥ భద్రాద్రి వాసుడు నేసూ - నిన్ను బాయలేను

ఎందుబోమెడను - అద్రిజ సుతుడాను అమరేంద్ర పూజితుడ - నిదుర కంటికిరాదు నీమీద భ్రమపోదు ॥ఎవరి॥

వ. ఇంకా నేమనుచున్నాడు.

క॥ జననీ జనకులు నెవ్వరు - అనుమానము నేల నిపుడు నందరిలోనఁ
ఘనమేటివి మృదుబోటివి - మనసిజరూపములకేనుమరితాళనహా॥

కీర్తన

బంగారు మేనిచాయ భామ నీవెవ్వరే - శృంగారముల బంతి అంగన చెప్పవే ॥బం॥ శకునము మంచిదాయె చెలియ నేరాగాను - శుకవాణినిన్ను కన్నుల జూచితీవేళను ॥బం॥ పారుటాకు చీర భామ నీకెందుకె-తరుణిజల్తారు చీర మురియుచు దెత్తునె ॥బం॥ గురిజారి సలుకు లేల కులుకు మిఠారి రావె-తరుణి ముద్దులగుమ్మ మణులు నీకిత్తునె ॥బం॥ నెమలి పింఛమువంటి నయమైన బులాకి - క్రమమున నీకు బన్నసరము నీకిచ్చెద ॥బం॥ ఎదురు తండులములు నెందుకె కోమలి - నుదుట కస్తూరి లేఖ యిదిగో నేనిచ్చెద ॥బంగా॥ తళుకు నీచూపులకు తరుణి నేతాళనే-బెళుకు నీ కుచములకు బెదరితినె కోమలి ॥బం॥ భ్రమజెంది వేగరావె భద్రాద్రి పోదాము - సుమశరు పువ్వులబంతి సుందరి మ్రొక్కుదు.

క॥ నీచూపును నీరేఖయు - నేచుపుతో జూచిమరుడు నేమముతోడఁ
కాకులు బలుకుచు పువ్వుల - నారసముల నేసెభామ నాతికోరావే॥

చెంచులక్ష్మి

గీ॥ ఎవ్వడవు నీవు ననుబిల్వ నెకిలివాడ - అడవి చెంచుల మోరోరి అదిగో చూడు - భేరీ దుందుభి మ్రోతలు బెడిదమొప్ప - చూడు మావారు వచ్చేరు వాడలోన॥

నరసింహుని మాట

క॥ మీవారు నన్ను జూచియు-కావలసిన వాడననుచు కరుణతోవేడఁ
భావంబు భక్తిజేయుచు-నోవనితరో పెండ్లిఁజేసి యుగ్గడ జేతురో॥

చెంచులక్ష్మి

గీ॥ పెండ్లి యేమిర దాసరి పెద్దవాడ - నోరుమూసుక పోరోరి యేర గొణుగు-చూచి భయమాయె నీచూపు సుందరంబు - చిన్నబాలను నన్నిట్టు లెన్నదగున॥

కీర్తన

ఎవరైతే నేమిపోరా - నాతో నెదిరించరాకు రాపోరా - దవ్వుగానుండు మాట్లాడు దగ్గరవచ్చేవు - కోపమున బాణముల గొట్టెదను జూడరా ॥ఎ॥ బొక్కినోరు పండ్లపొడగన రాకురా-దూరంబునరుగు జోకతో మావారు కేక లేయుచువచ్చి - భీకరంబున నిన్ను పాకంబుఁ జేసెదరు ॥ఎ॥ మిడిగుడ్లు వడి మీసములును - నోసటను పొడుగు నామాలు చాలు-కడుబొబ్బ జేసెదవు నమ్మకైతే బహుదళము-చెలికాడ కుఱ్ఱవైతె జడలు కట్టినావి ॥ఎ॥ నరసింహ రూపంబువాడ - నాతోసరి రాకు నీవు వేగపోరా - సరసంబు లాడెదవు చాలురా భద్రాద్రి - మురియుచు బోతుంటె వరబాణమున వేతు ॥ఎ॥

ద్విపద

ఇవ్విధంబున మృగవేషంబులేల - పల్కెదు త్రోవలు బంధించు రీతి - నీవెడ నేనేడ నిను గూడుటేడ - మానవశమందున మరియాద గలను - కులకోటకును మేటి గూడెపురాజు - శశినాయకుండనే జగతి ప్రఖ్యాతి - అకలంక గుణతేజ డతని పుత్రికను - అన్నలు తమ్ములు సఖులు బాంధవులు - ఉన్నట్టి దానను నొప్పుగ నేను - మనసులోన నె త్రోవమెలంగుచుందువ స్త్రీ - వనము చెంచులాము వచ్చిన జాడ - ననునిట్లు బలుకగ న్యాయంబుగాదు-వింటె చెంచులు నిన్ను కట్టివేయుదురు - వింటె చెంచులు నిన్ను దునిమివేయుదురు - ప్రాణంబు దక్కితె బలుసు కూరైన-వసుక తినవచ్చు ఎవ్వరైనాను - పారిపోనాతోను పరిహాసలేల - పేరెంత యూరెంత పెద్దరికమెంత - నరసింహ నిన్నును నమ్మగజాల - దారి పట్టుకపోర దాసరివాడ॥

చ॥ చలముతో త్రోవలన్నిలచి చంచలమొందుచు నవ్వుకేమిరా
చిలుకలు రాజహంసలును చేగుకోవెల నీలకంఠముల్
పలుకుచు బల్కుచుండగను పైబడివచ్చెను బాణజాలముల్
మెలగుచు వచ్చెమూడుమరి మేలుగదాటర యోరిదాసరీ॥

స్వామిమాట

సీ॥ నీతో బూటకంబు నేజేయకుంటేను జన్మంబునొల్లనే చంచలాక్షి
పాలిండ్లుకరమున బట్టిపినగకపోతె హస్తము లేలనే హంసగమన
అధరోష్ఠబింబంబు లానకపోతేను మోవికాదదినాకు మోహనాంగి
ఆలింగనముక్రీడ నలిజేయకుంటేను దేహంబునొల్లనే దివ్యవాణి

గీ॥ అలసిసొలసియు నీతోడ నందమొంది ♦ కురులుదువ్వెదు రత్నముల్ కూర్చివేగ ♦ కొప్పునందున పూదండ నొప్పుగాను ♦ నుంచకుంటేను నేనిక నోర్వగలన॥

కీర్తన

హాటంబు నేలనేబోటి దుర్ఘటంబునేల మితారి ♦ హాటంబు నేలని పుటంబునామది ♦ నాటిందివేగ పాటిచిచూపవు ॥హా॥ ఎంతవేడినరావు నన్నింక బ్రోవు మికజాలదు ♦ పంతమేలనే చెంతకువచ్చితి ♦ చింతదీర్చవె కాంతరో బ్రెముక్కెద ॥హా॥ కోరినద్రవ్యములిత్తు నన్ను కోపగించ కిటువత్తు కూరిమితోడుత చేరతీసుకొని ♦ మారునిబారికి మగువతాళలేనే ॥హా॥ పంచరంగులచిలుకా నన్ను పలుకరించవే మేము మలుకా ♦ పంచశరుడుతా నేను బాణములు - పొంచివేసెను అంచయానరో ॥హా॥ మూర్ఛవచ్చునే చెలియా నీవు ముదముతోరావే చెలియా ♦ అర్చించెద నిన్నమరపువ్వు ములగూర్చియు నామీరద కోరికవేగమె ॥హా॥ వేడుక ఇండ్లాడెదను నిను గూడి భద్రగిరిచూడు ♦ మేడమీద నాజోడుకూడి నీవాడుచు నుందువు నాతిరో వేగమే ॥హా॥

వ. నరసింహా దేవు డతివిరహాంబుననుండగ చెంచువనిత యేమనుచున్నది,

గీ॥ ఎవ్వడవునీవు నన్నడ్డు నకిలివాడ. ఏమిపనినీకు నాతోను నెరుగచెపుము వేటమార్గంబువచ్చితి వేడుకలర, చెంచువారము జాతిని చెప్పనేల.

ద్విపద

వినరోరి దాసరి విహీత వాక్యములు - మనసు నొచ్చేటట్లు మతి యీాడెదావు - చెంచుశిఖ నాయకుడు జయుడుమాతండ్రి - మంచిమృగ ములవేగ ద్రుంచునువినర - గూడెపు చెంచుల గూడుకనతిడు - వేడుకతో డుతవేటాడజనెను - జోడుబాసివ స్త్రి జాడలేదాయె - రొవ్వారు లేరిక యేమి సేయుదును - పోవుదునూరికి పొందుగానేను - వాదుచేయుచు నీవు పలికెద వేమి-మావారువచ్చిన మర్దించగలరు - ఎవ్వరైననువత్తురిక నేనుబోదు- దాసరివై కృత్రిమమునీకేల - దోషంబులెరుగవు దొంగరీతిగను - ప్రాణి కైనను కొంటెగాని మాటేమి - దాసరివాడవు మరిదాగిపోర॥

వ. నరసింహస్వామి యేమనుచున్నాడు.

చెలియరోయాచెంచు శిఖనాయకుండును - కలికిరోమాకు మామ కావలెసుమ్మి ॥చె॥ మోహనాంగిరోనీవు ముదమొప్పగలవె - సాహసం బునవేగ సరగునరావె ॥చె॥ దాసరివాడవని తగనన్నుపలికితివి - మాసది

వారెవరె మన్మథునిభుడను ॥చెలి॥ వేటాడనీకేమి వెలదిరో నాతోను - కూటంబుచేయవే కొమరొప్పగాను ॥చె॥ నీటుగ భద్రాద్రి నిలయుడ నే నింక - పాటలగంధిరో పాయకుండెదనె ॥చె॥

వ. చెంచిత యేమనుచున్నది.

క. కులమేదిర స్థలమేదిర, కలకాలము నీవునుండు కాపురమేదీ
యిలయెల్ల తిరుగువారము, చలముతో నీవిట్టురాను పైపడుపోరా.

స్వా మి మా ట

గీ॥ గరుడగిరి వాసుడను నేను కమలనేత్రి- దేవదేవుడ జగమెల్ల దేవుడంద్రు
పేరుచెప్పెదనరసింహ పేరువాడ, కులములన్నియుమావె యోకుందరదన

కీ ర్త న - వా ద ము

చెం॥ చెంచువారము మాతో చలము నీ కేటికి నారసింహా - మేము
మంచివారము మీరు మాతోను సరిరారు నారసింహా॥

నా॥ మదవతి మీదియు మంచికులంబులే చంచలాక్షి - నీవు పదరకు
మోచెలి అతివ జ్ఞాయేతివి చంచలాక్షి॥

చెం॥ జాతేమి నీతేమి జాడ తెలిసెను పోర నారసింహా - నన్ను ప్రీతితో
మా తండ్రి పెంచినదానను నారసింహా॥

నా॥ నీతండ్రి వైతేనో నాకు మామవిను చంచలాక్షి - నీవు నాకు మఱి
దాలవె మాణిక్యములబంతి చంచలాక్షి॥

చెం॥ వేటాడ వచ్చినాతో మాటలాడెదవు నారసింహా - నాతోడ నీకే
మిర త్రోవలో నిలువాకు నారసింహా॥

నా॥ భోటిరో నీజాడ పూనివినినే వస్తి చంచలాక్షి-నేనే నీతోటి కూట
ము నే జేయుకుంటేను చంచలాక్షి॥

చెం॥ వద్దనిచెప్పితె బుద్ధిలేద నీకు నారసింహా - సద్దురుచే మావారు
హాఱని ద్రుంచేరు నారసింహా॥

నా॥ మీవారు వస్తేమి మావారు వింటేమి చంచలాక్షి - నా భావ
మందునిన్ను భార్యగ జేతునే చంచలాక్షి॥

చెం॥ అట్లనబోకుర అతివెఱ్ఱి మూర్ఖుడ నారసింహా - నీవు మాట్లాడ
గనుబోకు మర్లరా దుర్జనుడా నారసింహా॥

నా॥ పొలతి నినుచూచి పోబుద్ధి రాదాయె చంచలాక్షి - ఇంకచలమేల
నాతోను సరసములాడవె చంచలాక్షి॥

చెం॥ మంకువాడ నిన్ను మఱి బాణచయముల నారసింహా - నిన్ను
కొంచగ ద్రుంచిన నికబుద్ధి రాదుర నారసింహా॥
నా॥ అట్లయిన మంచిది యువతిరో విడువను చంచలాక్షీ-నీవుమాట్లాడ
కుంటెను మది తాళ జాలను చంచలాక్షీ॥
చెం॥ నీవంటి మూర్ఖుని నేవంకలను జూడ నారసింహా - నావంటి నెల
తాల ననుట ఫలంబేమి నారసింహా॥
ఎట్లయిన తాళాను నేలవేనన్నింక చం-యీపట్లభద్రగిరి నేనెట్లబోదును చం.
క॥ ఎన్నడు జూడని వింతలు। నిన్ననుగన ఫలమదేమి నీవలవేగా
ఉన్నారు కానుక బాధులు। తిన్నగ ద్రుంచేరు నిన్ను తిరిగటుపోరా॥

నారసింహుల మాట

గీ॥ ఎందరుంటేమి నీయందు జెందెమనసు। కుందకుట్మల దంతిరో కువ
లయాక్షీ। చంద్రుడును మదనుడుండెను సైపనేర। బాణములవేసె
వెన్నెల పైనగప్పె॥

కీర్తన - సంవాదము

బాణమెయ్య గలవా మృగముల బట్టిద్రుంచ గలవా - రాణెము
తోడుత జారుడుబండల మీదికెక్క గలవా॥ మృగములు బట్టెదనే నిక
నగములు తిరిగెదనే - పగతులు వచ్చితె రణము జేసియు పడవేయగ
గలనే॥ గట్లు యెక్కగలవా పెద్ద చెట్లుప్రాకగలవా - చెట్లమీద నెజుంటి
తేనెలు తెచ్చియివ్వ గలవా॥ చెట్లు యెక్కెదానె పక్షులనే కొట్టెదానె-
కల్లమాటలు నాతో నెందుకు కరుణ చేయువటవే॥ పులుల గొట్టెదవా
పెద్దపులులబట్టెదవా - ఫలములుచాల సాలపువ్వులు పంచియివ్వగలవా॥
ఫలములు దెచ్చెదనే చెలియ పగయేలనె నాతో - కులము వారలతో
కూడుకనుండెద కలకాలముబూని॥ పుట్టకుక్కలాను పట్టి పూనియియ్య
గలవా - పెట్టెగురిజల సొమ్ములుదెచ్చి పేరువెయ్యగలవా॥ ఫలముల
దెచ్చెదనే జలనిధిలో నీదగలనె - స్వామిచెంచు గుంపుల గూడుక సాగి
మ్రొక్కగలనె॥ పొదలదాటగలవా పరికిపొదల నీదగలవా - ముదమున
నరసింహా గజములబట్టి మొట్టిగొట్టగలవా॥ మృగరాజునుబట్టి చెలియ
మదము గొట్టగలనె - గజమును దెచ్చి యిచ్చినిన్ను నే కౌగలింప
గలనె॥ యిన్ని పనులుచేసి మాతో నిటులుండగలవా - చెన్నుమీరగను
నీలకంఠముల దెచ్చియివ్వ గలవా॥ నీవు చెప్పినట్లుభామ నేను చేసెదనే-
బాసలుచేసెద నమ్మవెనీవు భద్రాద్రీశుడనే॥

వ. చెంచిత ఏమనుచున్నది.

క. గూడెపు చెంచులతోడను, జాడల మా తండ్రివచ్చు జాగాయెనురా
కూడగ బోవలె వేగము, వేడుకతో బంధుజనులు వెరతుర వినరా.

నారసింహస్వామి మాట - కీర్తన

రావేరావే చెంచితా నీవింటాకరావె చెంచితా ॥రా॥ రావెనీదు మోవిపానకమిచ్చి - జీవంబురక్షించు వేగతాళగలేను ॥రా॥ కందమూలము లేల సుంకుబియ్యము లేల - సుందరి నాతో సుఖముగ నుండువు॥రా॥ చంటిమొనల రొమ్మునంట గలిగితెచాలు - జంటితేనియలు మంచుల వెంటనె పోయితెత్తురా ॥రా॥ కులము చెంచులగూడి విల్లునమ్ములు బట్టి పులిసింహములనెల్ల పొడిపొడి గావింతు ॥రా॥ ఆదిలక్ష్మి కంటెను అధికంబుగానిన్ను - పాలించు భద్రాద్రి పతినివేగముచేసెద ॥రా॥

చెంచుల మాట - కీర్తన

పొరుటాకుల గట్టువారము - చెంచుభామతో నేమిబేరము ॥౧॥
తీరువన్నెలు సేయ నేరము - మీకు తెలియజెప్పెద మావిచారము ॥౨॥
మగవారి మాటలలో సారము - అది కలసినను వెనుక నిస్సారము ॥3॥
మఱచి భద్రాద్రి మందిరము - మఱి యాదవదాసు నేమారము ॥పొరు॥

వ. నరసింహస్వామి యేమనుచున్నారు.

సీ॥ విరహంబుచేతను వెలదితాళగలేను మన్మథుండేసెను మందగమన
ఇంతకఠినము దేల యుంచునిభానినా కాంతరొనన్నిక కౌగలింపు
మెంతవేడినగాని సుంతైన దయరాదు పంతమా నాతోను పద్మగంధి
చిలుకరథమ్మెక్కి చెలరేగిమదనుండు పుష్పటమ్ములనేసి పువ్వుబోణి
గీ॥ మదిలోకోర్కెలుదీర్చవె మందగమనఎందుచూచిననీముఖమందెగలదు
నిలువ జాలను నేనింక నిన్ను బాసి।నిమిషమెట్లాయె రమ్మికనీరజాక్షి॥

వ. ఆ సమయంబున నరసింహుడు మూర్ఛనొందిన, మన్మథుండు తన తండ్రిమీద దయఁదలంచి చెంచు వనితయందు ప్రవేశించి నంతలో

చ॥ మరుడను రామ చిల్కలను మంచి రథమ్మును కమ్మబాణముల్
గరిమతో పువ్వుటమ్ములును గంధ సుబాహుడు తేటిగుంపులుం
ధరణిజులందరు న్విడగ దండిగ వేసితి బాణజాలముల్
విరహులనేసి ద్రుంచెదను వీర పరాక్రమడ మన్మథుండరా॥

గీ॥ వజ్ర వైడూర్యములు మహా పరుసతోడ । వెలుగుచుండగ రథమెక్కి
వేగిరమున । గంధుకోవెల మొగలైన గళరవంబు । చిలుకదండుతో
సేవస్తి చిచ్చువలెను॥

కీర్తన

ఆనందుడను సేవినంగను పుష్పాటుప్పుల వేసెదనంగను । అనంగు వలెనే కనంగవచ్చితి ఆ దురంబు కేసెదభరంబుగా నేకనిబ్బరంబుగా । కరంబున క్రూర శరంబులును బూని - మెఱుఁగు బోణుల కరంబులఁ జేసి ॥ఆ॥ పికంబులును కేకిచయంబుతో నే శుకంబులను బాణసంఘం బుతో - నింకేటు పొయ్యెవు అకాలసర్పము శరంబు బ్రహ్మాశకంబు జేసెద ॥ఆ॥ జోడంజేలని జాటించెదను - కూడంగ వచ్చినే నాడించెద - చూడంగ భద్రగిరి వేమకతోడుత నాడును శ్రీరామజోడు వాడనునే ॥ఆ॥

ఉ॥ కోవెలగుంపుఁగన్ చిలుకకోకిల పిండులు రాజహంసలున్
భావజుడన్ననున్ విసర బాధలబెట్టితి పద్మగంధులన్
నావలెధీరు లెవ్వరిక నారదముఖ్యులు వాలఖిల్యులున్
భూవరులందఱున్ భయము పూనక యుందురు నన్ను జూచితే
కావగ లేరు నెవ్వరును కంజదళాక్షుని పుత్రునందఱున్॥

ద్వారపాలకుడు

ఉ. అంగములేని వాడవని యంబరభూమిలో బల్కుచుండగా
పొంగుచు రావదేమి నినుబొందినవార్తలు వేశతాపముల్
సంగతి నోరు చుండెదరు చాలుర మన్మథ నీదుజన్మమో
భంగము దెందుకాయె నిక పల్కుము వేగమె మీనకేతనా॥

ద్విపద

వినుద్వారపాలక వృత్తాంతమంత - వినుపింతు కమలముల్ విమలత జెంద - ఆదికాలమునాడు నాదక్షుడూను - మోదంబుతో యాగమును జేయఁబూని - అతనికి నల్లుండు ఆరుద్రుడూను - హితవులేకను ద్వేషమిద్దరికి నుండ - దక్షునిబిడ్డయు దాక్షాయణీయు - కాంతతో యాగంబు కడకు తాఁబోవ - చూచియుదక్షుండు సుందరితో వేగ - వాడు నిష్ఠూరంపు వచనంబు పలుక - శంభునిదిట్టుట శ్రవణముల వింటి - అంభోజగంధితా నప్పుడును జూచి - దేహంబు భంగంబు దిగులుతో జేయ - మోహంబుతోడుత మొనసితా శివుడు - వేగరంబునదోలె వీరభద్రునిడి-

బాగుగాయజ్ఞముల్ పదపడిచేసి - దక్షుని శిరమునుతక్షణమె ద్రుంచి దీక్షతోవచ్చెను తీవరంబునను॥

క॥ అదివిని శివుడును వేగమె-పదపడి తపమాచరింప వడిగాబోయెన్
మదిలోబెదరుచుసురలును ముదమునశివదర్శనంబు పొసగదయనుచున్॥

వ. అని విచారించి దక్షుని శిరంబుద్రుంచె దాక్షాయణి యుహిమవంతునికి కూతురై జన్మించియుండె నపుడు.

ద్వారపాలకుని మాట

గీ. సురలునిన్ను జూచిసుస్థిరగుణులైరి - వినుమునొక్కమాట వీనులలగ
రుద్రతపమునీవురూఢిగ జేసియు - మమ్ముఁ బ్రోవవయ్యమన్మథుండ॥

ఉ॥ ఇంపుతో వేగముఁ జనియు నీశుతపమ్మును భంగపెట్టుచో
గుంపుగనున్న యీపొదలో కూర్చియుపువ్వుల బాణజాలముల్
సొంపుతో వేసినంతమఱి చూచి శివుండును చిచ్చుకన్నునన్
దెంపుతో తెర్వగాముడును తేజముతోడుత భస్మమాయెరా॥

తెర వెళ్ళే కీర్తన

మన్మథుండువినరా ద్వారపాల - మరివేగమునకనరా॥ మన్మథుండునువిను ముదమునరథమెక్కి - యున్నతమున వేగ నురుకుచువచ్చెను॥మ॥ కోవెల గుంపులూను చిలుకలదండు కోయని కూయగను - భావజుండను నేను పదపడిచెలులను-భావమందునపూల బాణంబులవేతు ॥మ॥ పల్లారుపాగయును డాలుకత్తి జాజిపువ్వు జామాయను-కల్లజేసెడ కాంతలుజూచియు - సుల్తానుపాదుపాను జూచి మోహించేరు ॥మన్మ॥ భేరిదుందుభిమ్రోతలుచూడనొ నారింటకాశంబును - భూరిభద్రాచల వీరరాఘవునిసారెకు వేసియు జారుని జేసెదను ॥మ॥

వ. ఆసమయంబున చెంచువనిత మన్మథునిం జూచి యేమనుచున్నది.

సీ॥ విషమాస్త్రనీవిల్లు విరిగి తునకలుగాను నసహాయశూరుడ వాట
యెఱుగ కుసుమబాణంబుల కుచగిరుల్వేయంగ కసిగందియున్నాను
కఠిన చిత్త పసిడితళుకులమించు బలువైననీకత్తి విరిగిభూమినపడి
మరిగిపోను రాచిల్క రాజయురథము భేరీలు కూలుడి నేలనుకలసి॥

గీ॥ క్రుంగిపోను బాలబేలను నామీద పగలు యేల ఫాలలోచను నగ్నిని
పడియునీవు కాలి కూలితివికపోర కమలబాణ అందమేలను నామీద
అధికదోషి॥

### మన్మథుని మాట

చ॥ అతివరో గూడు వేగమున నందపువచ్చిరి యెందుబోయెదో
పతితుఁడ వంచు నీవు నన్ను పల్కుట ధర్మము పద్మగంధిరో
అతిరథ శ్రేష్ఠుడన్ వినవె అంతనువిచ్చెను కంజబాణముల్
హితమతితోడ నిన్ను మది నేచగనేసెద తెప్పపాటులోన్॥

### కీర్తన - వాదము

కన్యాను నేనిక కలహామేలనుఁబోరా కమలబాణా - నా యున్నత మేలా గున్నది చూడరా పంచబాణా ॥౧॥ కన్యావృనివైతె అన్యాయమేటు నాకు కంబుకంఠి - వేగ చిన్న బాల నన్ను అనుటయేమె కంబుకంఠి ॥౨॥ చెంచు శిఖనాయకుడు జనకుడు తండ్రోయి పంచ॥ నిన్ను వంచించి నేనును పదఁపుట పనియేమి పంచ ॥౩॥ శిఖినాయకుండును చెలియ తండ్రై తేమి కంబుకంఠీ - నేను పకపక నవ్వుచు పటుబాణములు వేతు కంబుకంఠి ॥౪॥ ఒంటిగ వేటకు జంటలేకనువస్తి పంచ॥ నా వెంట నెవ్వరు లేరు కొంటె తనం బేల - పంచ ॥౫॥ ఒంటివాడనని కంటగించెద వేమి కంబుకంఠి॥ నన్ను వెంటకూర్చుకోవే తప్పేమి నామీద కంబు ॥౬॥ శంకరశూరుని నంభోధిపై చెద పంచ - మీజృంభణ మంతయు కుంభినిగూలరా పంచ ॥౭॥ అప్పుడె ద్రుంచితి ఆరాక్షసుని బట్టి కంబుకంఠీ - నీవు చెప్పినమాటలు తప్పక పలుకవే కంబుకంఠీ ॥౮॥ శుకపికరవములు చూచి దుఃఖించితి పంచ - యకలంక తేజము అడవిపాలు గాను పంచ ॥౯॥ చిలుకలగుంపులు చెలియ యిదిగో చూడు కంబుకంఠీ - నీకు ములుకులు నాటించి మూర్ఛ నొందించెద కంబుకంఠీ ॥౧౦॥ మకరధ్వజుడు వేగ మంటిపాలుగాను పంచ - నీ సకలాయుధములు శకలమైపోవను పంచ ॥౧౧॥ శుకపికచయములు ఖండితములాయె కంబుకంఠి - నిన్ను నికలేవ కుండాను విఱుగవేతు నేను కంబు ॥౧౨॥ కొమ్మరో కొఱకై కలలో వచ్చిన వాడ కంబుకంఠి - కలకాలము దుఃఖించి రందు మోహవార్ధి పంచ ॥౧౩॥ కలకాల మనుచును కలయుము నన్నిక కంబుకంఠి ॥౧౪॥ నా మకరధ్వజునితోడు మరిచింతపడబోకు కంబుకంఠి ॥౧౪॥ అయ్యయ్యో నాతోను హాస్యము జేసేవు పంచ - నీకు చయ్యాన శాపము గ్రక్కున నిత్తుర పంచ ॥౧౫॥ యౌవనము నీకు సొక్కైయున్నది కంబుకంఠి - యిక నయముగా నేవో నారాచములు వేతు కంబుకంఠి ॥౧౬॥ కంజదళాక్ష నీకు వందనము సేతుర పంచ - నేన పొందుగ భద్రాద్రి మందిరుల కాంతురా పంచ ॥౧౭॥ నీరజదళనేత్రి

వినవె భద్రాద్రీశ కంబుకంఠి - నాకు పొందుగ జనకుడుబోనియ్యడునిన్ను కంబుకంఠి ॥౧౮॥

వ. ఆసమయంబున మన్మథుం డెటువలె వచ్చెను.

పంచచామరము

ధనల్ ధనల్ మనుచు భేరీధ్వనులునుల్ల సిల్లగా । ఖణంఖణంమనుచు వేగసైన్యముల్ చరింపగా। భణల్ భణల్ మనుచు రథము బాగదెంచె చూడవె । ధగల్ ధగల్ మనుచుహయము దారపూను నోర్వవే। భుగల్ భుగల్ యనుచుభూరి వాద్యముల్ జెలంగగా । దిగల్ దిగల్ మనుచు గుండెధీరత జెడిపోయెనే । పగల్ పగల్ జేసివచ్చె పాపజాతి మారుడే ॥

ఉ॥ కుందయు లందమొందగను గూయును కాకియు కూతవేయగా
డెందము ఝల్లుఝల్లు మన డింది లతాంగియు నెందుబోదునో
కంద శితంబు కార్ముకము కాముడుకంఠము నేయుచుండగా
సుందరి మారుత ప్రపుపు చూడవె మిక్కిలి తాళజాలనే॥

బాలామణి తాళజాలనమ్మ -మారునిచేత బాణజాలము లదిగో- బాలయావనము కీలనవలెను - క్రోలగవేయుచు దూలద్రోచె॥ బాలా॥ మొగిలిరేకుల ఝుఃఝూలదిగో - ముఖమును వక్షంబుపగిలించెరకతారు లదిగో - జిగిబిగికములెగయగ మదశుకములను రథముతో కదలివచ్చె॥ బా॥ విచ్చుకత్తులజిల్లులదిగో - చెలరేగిలేమ్మొద హెచ్చుగచపములు జేసె నిదిగో - వచ్చెనించువిల్తుడు విల్లుబల్లెము అచ్చుగ నామదినావ్వసేసె॥ బా॥ వదలిపోడమ్మ నేడువీడూ మదమెక్కికో వెల లఱచూనయ్యె - పెట్టెచూడు అదిగో మీదనువదలక బాణము - పదపడివేసెను బాణముచూడవె ॥ బా॥ మటిమటి మంటలెగయుచూను మురిపెంబుతోను - కరవాలమున దువ్వూ చూను-సరసర మనుచును సరగున కచమును - నలుమలు లేకను నొక్కేను జూడవె ॥ బా॥ భామలందరుగూడి నేడు బ్రతికించుకోరె - సామాన్యపురుషుడుగాడె వీరుడు కోమలి - భద్రాద్రీశునిసాక్షిగ అమరిపొందిక ఏమి సేయుదును ॥ బా॥

మన్మథుని మాట

గీ. కలను వచ్చినపురుషుండు కంబుకంఠి, వేగవచ్చునె నీకింత వెఱ్ఱితనము, దుఃఖపడితేను వచ్చునా దుడుకుతనము, మానియుండవె నేబోదు మగువవేగ.

గీ. ఏమినరసింహ యీమూర్ఛ యెందుకికను, ఎంత చెప్పిన వినవైతి
వేమిసేతు, పంతమెందుకు లేవోయి పడులసామ్ము. నెట్లవచ్చెను
జాణవు నేర్పు వినరా.

వ. నరసింహులు ఏమనుచున్నారు.

ఉ. మోహము నిల్పలేను సతి మొల్లసుగంధిరో తాళజాలనే
మోహము నిల్వనాయ మరిముమ్మరి కాముడు బాణజాలముల్
దేహము జేస్చెచుకాఘనమతీవ్రత వేసెడి భామ చూడవే
ఆహవధీరుడు స్మరుడు నద్భుతమొప్పగ మూర్ఛ జేయునే,

వాదము

ఇందురావె యిందురావె యోసుందరి వేగమె - కందర్పశరముల ఘాతలకోర్వను ॥ఇం॥ రానుపోరా నేరానుపోరా రానుపోరా కాని మాటలుపలికి నేను మానభంగము జేతునురా - ఇందువదనరో కందర్ప దనా యందముగా కరులిందిందిరంబులు - సుందరీ శిఖను కుసుమములు ముడిచెద ॥ఇం॥ ఎవ్వడవురా బల్కెవ్వనావురా - నవ్వుచువచ్చేవు నా సందింపెదా - చివ్వకువచ్చితె సింహము పిల్లను ॥రా॥ సింహముఖుండనే స్పష్టిపాలుడ గహ్వరమున - చనుగవలిపయిని బహుళిహ్వ కోర్కెల చేత వందనములిడెద ॥ఇం॥ ఇట్టిమాటలు బల్కితివా బల్గల్లనుండి మా వారు గ్రక్కునవచ్చేరు - పొట్టకుతేను మళ్లిపోరనీనీతు లేమి ॥నా॥ నన్ను కాచియు మన్నించమనియు పున్నమచంద్రు సరిపుత్రి తోడను - తన్నన మందురు నిన్ను దీవింతురనిను॥ఇం॥ నీతు లేమిరా ప్రీతు లేమిరా నాతనయును చెంచునాథుడువచ్చి నిన్ను - బూతులుపల్కితే ప్రేలెదవు చెప్పరా ॥రా॥ నీతిగడించినా ప్రీతిగడించినా ఘతోముదంబున శేషశాయివయా - ఖ్యాతిగ జగమును గ్రక్కున నేలర యుల్లమందున - నొప్పెదు బొల్లి నామములు నిలువెల్ల ధరించి - దాసరిల్లు జేరుటాకు చెల్లున మా మర్యాద ॥రా॥ దాసరంటివా నాసరంటివా - భూసురశ్రేష్ఠుడ బుధజన సహితుడను-భాసుర తేజుడ వాసవవంద్యుడను ॥రా॥ విన్నవించు చున్నావు గాంచు - నెన్నిపనులు గల్గియున్నను కోర్కె - లన్ని జేతునని అభయం బొసంగుమి ॥రా॥ భ్రమతో వత్తు భద్రంబులిత్తు - నీవుచెప్పిన కార్యము లన్నియు - భద్రముతో జేసెద నేను భద్రగిరీశుడనై ॥కం॥

నిన్ను నమ్మరాదు నరహరి నీమాటలేమి - నిన్ను మించిన పర భామలను నమ్మి తిరిగెదవురా ॥ యటుగాదు జలజనేత్రి ఆమాటలేమి

సీతోడ - బాసలను జేతు నోర్వజాలనే - వలచి నప్పటిభాసలన్ని వదలి పోవునే॥ నిత్యకళ్యాణము జేసేవుగావి కరుణరాదురా - నిన్నువిడచి ప్రాణములు నిలువనాగలవా దేవి - అన్నపానాదులువిడచి ఇట్లుయుందువా - మాతల్లిదండ్రి కెరుక లేనిమాట తెలిసితె నిన్ను నేతీయన - బ్రతుక నియ్యరు యేమిసేతురా॥ నాతిరో బ్రతిమాలెదాను నమ్మవెందుకు - ప్రీతితోను నల్లుడాని పెంచుచుండరే॥ కలిగించితివి నాదుమనసు శ్రీచేకవయ్యనేనరహరి నీవంటివిభుడు నాకుదొరికెను॥ నాతిరో నాపూర్వ జన్మఫలము మంచిదే - దేవికోమలిరో భార్యవౌట కోర్కెదీరునే॥ వలనోయి భద్రగిరీశ పరమేశ - నిన్ను చాలగాను నమ్మితి శ్రీలోలుడా॥ మెచ్చితినే భద్రగమన మేఘులాయన్నను - నిచ్చతోను యూడవదానువిడిచియుండు వాడే॥

వ. ఆసమయంబున,

ఉ. మోమున మోముజేర్చి కడుముచ్చట లాడుచు ముద్దులిచ్చుచుఙ్
గాముని బారిమాన్పగదె కంజదళాక్షిరో నారసింహుడ
న్నీమహిలో బ్రసిద్ధివహియించితి సద్యశముం గడించితిఙ్
ప్రేమతొ నీసుదింగలుగు బింకముఁ బుచ్చుచు సంతసించుచుఙ్,

వ. ఆ సమయంబున నుభయులు నేకమైయున్నంతలో బ్రహ్మ మొదలయిన దేవతలు ముత్తయిదువలు అరుంధతి మొదలయినవారు వచ్చి విధిపూర్వకముగా కల్యాణం బొనర్చి యూనాడు నిలిచి మరునాడు వారివారి నివాసములకుంజని రంత,

సీ. సతితోనుగూడుక సరసంబులాడుచు మరుకేళిగడపెను మదనుతండ్రి
చెక్కిలినొక్కుచు చెమటలుచిమ్ముచు సొక్కుచుహారముల్ చక్కజేసి
అధరముల్ గ్రోలుచు అతిప్రేమతోడుత కొమ్మరైనపాలిండ్లు గుమ్ము
కొనుచు, కౌగిలించుకొనుచు కైదంటమిూర్చుచు కోసరు ముచ్చట
లంత కొమరుమిగుల.

గీ నడుముజవ్వాడ వడికొప్పు విడియుపోగ, కాళ్ళనందెలు నాణ్యముల్
ఘల్లుమనగ, సొమ్ములీడిపో హారముల్ సొగసుజార, క్రీడసల్పుచు
నుండిరి కేళితోడ,

వ. ఆ సమయమున సకల సుఖము లనుభవించునుండి రంత,

నారదుని రాక

ఉ. శ్రీరఘు రామరామ నరసింహ శివంకరు లోకనాథునిఙ్
భూరిపరాక్రముఙ్ హరిని పుణ్యచరిత్రుని లోకమాన్యునిఙ్

ధారుణిలోన భద్రగిరిదాశను నమ్మిన వాడ నేక దా
నారదమౌనినే వినర నమ్మితిభక్తితో లక్ష్మినాథునిక్.

కీర్తన

బ్రహ్మపుత్రుడనురా - నేపర బ్రహ్మనమ్మితిరా - బ్రహ్మజనకుని భద్రాద్రీశుని నాయకనుండెవరా॥ కరుణాపిధేయుడురా మరకతకనక కిరీటుడురా - గరుడగమనుడు పీతాంబర కమల నాభుడునురా॥ మూడు లోకములనూ తిరుగుచు మురహరిగానము - వేడుకతోడుత పాడుచు వచ్చితి వేలసంఖ్యలనురా॥ పాలకడలియందు శ్రీహరిపవళించి యుండునురా - ధారుణిలోపల భద్రాద్రిశుడు ధర్మవత్సలుడురా॥

ద్వారపాలకుని మాట

క. తెల్లని గడ్డము మెర - గ. మొల్లసిటువచ్చినీవు మెరయుచు వేగక్
నుల్లము ఝల్లనిపించెను, కొల్లలుగా తాటలూడ కొట్టెదకుమతీ.

నారదుని మాట

గీ. ఊరు నడుగుట నీకేమి యోరిమూర్ఖ, బ్రహ్మ ఋషులము మేమిక
పాపచిత్త, త్రిభువనంబులు చరియించి దివ్యముగను, హరినిచూడను
నేవస్తి అందముగను.

క. మంకులుమానియు వేగ మెం, పొంకముతో నీదు కథయు పొసగను జెప్పుమా
అంకెనువచ్చితి విప్రుడ, సుంకున శాసెదను చూడుచూడుర కుమతీ.

కీర్తన

నారాయణుని విష్ణు నామమంత్రము చేసే నారదుండనూ - వేగ సారసనేత్రుని సన్నుతిజేసేటి నారదుండను ॥నా॥ భక్తవత్సలుని భజన నేమారని నారదుండను - బహుభక్తితో భువనాలు ముక్తితో తిరిగేటి ॥నా॥ కమలగర్భునాకు ఘనమైనపుత్రుడ నారదుండను - విమల చరిత్రుడ విష్ణుభక్తునోరి ॥నా॥ నీకునజ్ఞానమునిచ్చెడి అంధకారము బాపు నారదుండను - వేగసుజ్ఞానమునియేటి జ్యోతిప్రకాశుడ ॥నా॥ భద్రాచలేశుని భక్తితోపిలిచెడి నారదుండను - వేగ అద్రిజరమణుని అతిప్రేమతో గొలిచెడి నారదుండను ॥నా॥

నారదుని మాట

గీ. గరుడగిరివాసు డైనట్టి కమలనాభు, డెచటనున్నాడు చెప్పరా
యింపులలర, చూచి భజియించి ముచ్చటల్ చోద్యమంద, నాటి
పోతెద నరసింహ నగరియందు.

### ద్వారపాలకుని మాట

గీ. వినుము ఓమునినాధ గరుడాద్రి వీరవరుడు, వేటమార్గంబు జనెనయ్య
వేట్కతోడ, పరగ శ్రీలక్ష్మియొక్కతె పవ్వళించి, చింతచేగుందు
చున్నది చిగురుబోణి

వ. నారదుండు లక్ష్మిరాయొద్దకు బోయి యేమనుచున్నాడు.

గీ. వినుము మాతల్లి శ్రీలక్ష్మి విశదముగను, పవ్వళించుట పనియేమి
పద్మగంధి, లేచికూర్చుండిమాట్లాడ లేదు వేగ, నారదుండను
నేనస్సి పారజూడు.

గీ. దివ్యముని నాధవందిత ధీరవరుడ, రత్నసింహాసనంబున రమ్యము
గను, పరగ వేంచేసియుండియు పాదములకు, నర్చనంబును జేసెద
నమరవినుత.

### నారదుని మాట

చ. నగరిలో నారసింహులును నాతిరో లేరిక నెందునేగిరో
జగములు నేలుపాడిట గజమ్ములు నశ్వరథమ్ములుం గ్ర జనుల్
ఇగనెటుబోయె నమ్మ వచియింపుచలింపక నాకు జెప్పుమీ
పగతుల ద్రుంచ రాజనెనో పద్మసుగంధిరో యాజ్ఞ యివ్వడీ.

### కీర్తన - సంవాదము

నారదవినవయ్య నారసింహుండు- వేటమార్గముబోయె బలవంత
ముగను - ఎన్నడుగా లేదు యిదియేమి వేటయో - చిన్నబోయెను నగరు
చింతదోచెనే॥ వలదనినేనెంతో వాదించినగాని - చలముతో పోయెను
చక్రధరుడిప్పుడు॥ నీకెదెలియునుగాని మేదినీశ్వరుని - పోకడ మంచిదె
పూబోణి వినవె॥ నాకుకలవచ్చెనునారదవినుమా - ఏ కాలమునకును నేమి
ప్రాప్తంబో - కలలో నేనునివచ్చె కాంతరో చెప్పుమా - నిజము చెప్పెద
నమ్మా పరమకల్యాణి॥ యేమి చెప్పెదుహరి వేటకుబోయి- భామనొకతె
చెంచుపణతినిదెచ్చె॥ ఇంక యెటువలెనాయె యింతిరో చెప్పుమీ-సంకటం
బుగదోచె సమ్మతిగలదె॥ యెరుక తానడిగితే యెలమితో దూతను - మరు
వను శ్రీలక్ష్మి మాటయునిజము॥ చెలియరో నీవిక చంచలింపకుమీ -
మలయజగంధిరో మగుడివచ్చెదనే॥ దివ్యదృష్టినిమీరు దేదీప్యముగను-
భవ్యచరిత్రులు పరగంగ జెపుడు॥ అనరాదు వినరాదు ఆముచ్చటేమి -
నేబోదు భద్రాద్రి యీశునికడకు॥

వ. ఆసమయంబున నారదుండు లక్ష్మి ఆజ్ఞనేగి నెటువలెననిన.

లక్ష్మీదేవి - కీర్తన

జయజయలక్ష్మీశా జయరాధకరుణా - జయజయ భద్రాద్రీశుడ నరహరి జయసీతారమణా॥ గరుడగమన శంఖచక్రధర ఆయుధరమణా- శరణభూధరగోవింద జగన్నేకభరణా॥ కమలనేత్ర సుజనమిత్ర కరుణాంతరంగ-విపులలోచన అమరవందిత విశేష జనరక్షా॥ పీతాంబరముల మణులకిరీట హారుడవు - కోటిరత్నంబులు నీకు గోమేధికములు-ఆభరణములింపొంద శ్రీహరి భద్రాద్రీశుడవై - ధరణిలో యాదవ దాసుని నేలినవరుడు మీకునయ్యా॥

వ. నారదుండు భజనజేసికొంటు తీవ్రగమనంబున అరణ్యామందు దిరిగి గహ్వరంబులు దిరుగుచువచ్చి చెంచులక్ష్మిని నారసింహుని జూచునంతలో నారసింహులు యెదురు వచ్చి యేమనుచున్నాడు.

పంచచామరము

త్రిజగములను తిరుగుచూను తీవరంబు తోడుతన్
అజుడు శివుడు మిమ్ము గాచి అందమొందు చుండగా
గజము సింహములు నుండె కారుటడవిలోసికిన్
భజన చేయుచూను రాగ పనియు మాకు జెప్పుడీ.

కీర్తన॥ దండము నారదమౌని ఘనతాపస వరగుణశ్రేణీ - నిండుభక్తితో నునీకు మ్రొక్కెదను - అండజురాకడ ఆశ్చర్యంబుగను ॥దం॥ కుండలి శయనునిమీరు బహుదండిగ నమ్మినారు - అండజవాహను నాత్మలోదలచుచు - దండివారలు మీరు తెల్సిరాకడ ॥దం॥ అతిథుల దర్శనమౌట మా ఆపదలన్నియుపోవ్రుట - విధిసుతమాకిక వందనంబును ముదమునీరాకడ పదపడిజెప్పుడి॥దం॥ చాలనాళ్ళకుమీరు మాసన్నిధికిటువచ్చి నారు- మేలుగ భద్రాద్రీశుడనాకిక - చాలగజెప్పుడి లీలలువినియెద ॥దం॥

నారదుడు

గీ. మేలుమేలాయె నరసింహ మేదినీశ. నీకు రాకడ పనియేమి నీరజాక్ష
నగరమునువీడి శ్రీలక్ష్మినాతివిడిచి, భక్తులనువీడి వచ్చినపనియు జెపుడీ.

నరసింహస్వామి

క. నారదవినుము వేగంబున, ధారుణి భారంబు గుడుప దగవచ్చితినే
కూరిమితోడుత వేటను, జేసెయు విహారించినాడ చిత్తము మెరయన్,

కీర్తన - సంవాదము

దేవదేవ వినుమా యేమౌ తెగువదోచ కనుమా - దేవినివిడిచి చెంచువనితను చేపట్టగదగునా- గరుడాద్రికి నేను నారద నడచివచ్చి తేను-

యరమరలేకను చెంచువనిత నా కగపడె నికవినుమా - చూచిన వనితల మూస్వామి సురతికేళిబూని - యాచెలికత్తెయు మోహాము నుండుట నిది యుపాడయగు నా-అందంబునుగలది అతిమాటలుమధురముగలది-సుందర వనితల మెందుజూచినా యిందుసాటిరాదా - పరస్త్రీవర్జితులూ స్వామి పరమాత్ములుమీరు - వరగుణశ్రేష్ఠులు కులముతక్కువ వనితను గూడితిరి ॥అట్లుగాదు వినుమూ నారద కల్లమాటలేమి - ఎల్లజేసేటి వారల మేమిక యట్లజేసెదాము ॥పాలవంటికులమూ నీళ్ళ పాలు జేసితిరి - యేలను లక్ష్మీదేవిభించెను యేమనునోసుమ్మి॥ పాలునీళ్ళుమేమూ నారద పాలన జేసెదమూ - వాలాయమ్ముగ వోచెలినికిక వనితయు కావలెనూ - ఆది లక్ష్మిగాదా మీకు అమరియుండగాను - హీనమయ్యె కార్యము సేయగ వనితను తెచ్చితిరి ॥యెక్కడికిమీరు నారద యుకుగక వేగముగ - యేదిక్కయినను వెక్కసమాడకు నాతోడికవినుమా ॥ నరహరియేగెదను త్రిలోకము నయముగ దిరుగుదును - హరిహరి లక్ష్మికడకు బోను నే ఆనందమువినుమీ - లక్ష్మియంతజూడు యీచెలి లావణ్యముజూడు - పక్షము లేదనుజనన మొందితీ దీక్షతనీకేమి-భయము లేలస్వామి యీ వనిత నదిమించినది - యేలనయ్య భద్రాచలనాయక వాసవాపెవినుతా॥ యేలర నికవినుమూ నారద యేకచక్రముగనూ - వాలాయముగా యీవిడనాకు వనితయుగావలెనూ ॥

## కీర్తనవాదము

నరహరి నీవింతాజెప్పితే నయముతోనీకింత - మురిపెముదోచెను ముచ్చటవింటె ముదంపడె వనిత-మానిని కోపమేమి నను మర్మమడుగు టేమి - కానిమాటలు నాతోబల్కుచు కలహామాడుటేమి॥ వేటమార్గమేమి యిటవచ్చి వేడుకాడుటేమి - బూటకమాయెను చెంచువనితను పెండ్లియాడుటేమి॥ వచ్చి తెభయమేమి వేట దనరనాడితేమి - చెంచువనితను పెండ్లియాడితే చేసినతప్పేమి॥ తప్పుగాదునీకు లక్ష్మిని తగవిడిచితె మాకు - వొప్పదునాయం చెంచువనితను వలదు గూడుటయును॥ లక్ష్మియంతజూడు యీచెలి లావణ్యముజూడు-లక్ష్యము లేదు ఆచెలిపేమోము లావణ్యము లేదు॥ పక్షపాతులయ్యా మీరు భార్యనువిడిచితిరి-కక్షతోడుత కులముతక్కువ కాంతను గూడితిరి॥ అట్టు అనుటయేమి నారదయతి సుందరివినుమూ॥ కల్లమాటలుయే లనాడెదవుగాని వేగజనుమూ యిలలో గలయట్టిచెలులా యెలమితో చేకొండి- కులముయేటికి గుణము యేటికి

వలదు మీరిటానూ॥ యెట్లు జేసెదో వారి నారద అట్లు జేసెదను॥ యిట్లు బలికితె యేమనవచ్చు యీశ్వరాజ్ఞ లెండి-కోపమేలనయ్యా నరహరి ఈపని జేసితిరి॥ సాఫల్యంబున మీరుండుడి పరగున బోయెదను॥ యెందును బోయ్యే దరమీరు యిందిరవద్దకును - పొందుగ పోకుడి భద్రాద్రీశుని యిందిర వినవలదు॥

నారదుని పంచచామరము

చెంచువనిత చక్కదనము చెప్పలేను యీశ్వరా
పంచబాణు చిలుకపద్మ గంధియతివ చూడగా
మంచిగాను మదని కేళి మించుజగము లెంచగా
వంచనాను లేకచేయు వాసవుండు మెచ్చగా.

మత్తకోకిల

సంతసిల్లె నాదుమనసు సత్యవంత మీరిక
యింతలోనె కాంతమనసు కరుణలేక మెచ్చగా
పూర్వమందు పుణ్యఫలము పూర్ణమయ్యె పొందుగా
కాంతరత్నములను జూతు కరుణతోను నారదా.

వ. ఆ సమయమున చెంచువనితను నారసింహులకు వందనంబులు జేయించి తదనంతరంబున నారదుం డేమనుచున్నాడు.

కీర్తన

ఇంతిమదనుని బంతిచూచితె యెంతో వొయ్యారి - కాంతరత్నముల దొంతి చంద్రునివింత ముఖకాంతి - పంతముతో కుచాలు తమ్మోద బంతి యంతశోపలను-ఎంతో వింతగ గంతు లేయుచున్నానయ్యా ॥ఇం॥ చంచలాక్షి పలుకులు చిలుకలమించె గాబోలు - మంచ మేమి నుంచ వశమాన వంచన జేయు - జగములు మించెకొంచె మనరాముసగు ॥ఇం॥ వారిజాక్షి వజ్రపురి నిజవాస మెరయగా - సారసాక్షుడు నరహరి వేగమె గోరిముద్దివ్వగ - వారిజభవుడును కోరి ముందర జేరి క్రీడలాడుచును - వేగమీరి పలుకుచుండగాను ॥ఇం॥ పంతముతో భద్రాద్రీశుని యింతి లక్ష్మి సంతసము బ్రహ్మాన్ద్రా సెనో - సవతిబోలు చింతచేతను యెందుంచను యింతలోను బోయెదాను ॥ఇం॥

వ. నారదుండు స్వామితో నేమనుచున్నాడు.

సీ. స్వామినేజోదు జగములో సంచరించ, భామతోగూడి నగరంబు బాగుగాను, చేపపతెగాని యడవిలో నరులులేని, చోటనుండుట మంచిదా చోద్యముగను.

వ. నరసింహస్వామి నారదునితో నేమనుచున్నారు.

కీర్తన వాదన

వినరయ్యనారద వింతలజేసెన మానినాథా – నమ్మగన్నావయ్య మిమ్ముల నమ్మినానుసుమ్మి మానినాథా – యేమయ్య శ్రీలక్ష్మిని యెట్టు బలికేవారు ఏచేదాను – ఈభామను గూడుక ప్రేమతోనుండుచు బాగుగాను। అంతటాదిరుగండి అటుతక్క బోకండి లక్ష్మితోను – యీవింత జెప్పితె రంతులు జేసును చింతతోను॥ మాకేమి పనిలేదా మీకు మెరకేయులేదా – ఆలోకమాతతో యేకాంతమైనార॥ చిన్నది చెంచుది ఎప్పుడు మెరుగదు మాని – చేరున్ననావద్ద కడుతండ్రినిబాసి మాని॥ విల్లునమ్ములుపట్టి భూమిదిరిగినార – ఈచపలాక్షిగట్టిగ చెప్పనేటికి మీరు॥నార॥ అట్లనపోకండిఆముద్దురాదయ్యమాని–యీపట్లరక్షించియు పణతినిదయజూడు మాని॥ చల్లగవర్ధిల్లుడీ సతిపతులిద్దరు నార ఇ॥వుల్లము కంజిల్ల వుండుటయాగద నార। గరుడాద్రికినిమీరు గ్రక్కున పోకండి మాని– వేగముగ యీచెంచులక్ష్మికి మెరిగింప పోకండి॥ మాని॥ చెంచుదాన్ని నీవు చేపట్టిమురిసేవు నార॥ నీకు మంచిదికాదయ్య మహాలక్ష్మి నీకు నార॥ అయినకార్యమునకు అనబోకు నీవేళ మాని యింత భయంబేది యింక జెప్పకు నార।యిక చింత యేలను భద్రశైల పరమేశుడ నారసింహా!

గీ. సంచరించిన బోనయ్య జగములన్ని, మంచి కాలంబు మీరును మనసులోన, మెంచిమూడుడి నాకది కొంచగాదు, ఆదిలక్ష్మితో సమురాలు అరుగవయ్యా.

నారదుని మాట

క. ఎప్పుడు మదిలోదలతును, తప్పక శ్రీలక్ష్మినాథ దాసునినేనుగ మెప్పును భార్యను గూడక, యిప్పుడేపోయ్య వెంట యినకులనాథా.

వ. అనను యుంబున నారదుండు అనుజ్ఞ వడసి లక్ష్మివద్దకుం బోయి నంతలో, ఆమె లేచి వందనంబులు చేసి సింహాసనంబునిడి గూర్చు న్నంతలో యేమనుచున్నది.

లక్ష్మిమాట

సీ. ఎంతో శుభదినము బు మీరలేఘటియుకు, సంతసిల్లెను నామది
సత్యవంత, ప్రాణనాథుండు నరసింహ పతియు వేగ, వచ్చెనా
చెప్పుడొకమాట వనరుహాక్షా.

నారదుని మాట

గీ. అమ్మ వినవమ్మ లోలాక్షి ఆదిలక్ష్మి, చెప్పెదను నేను నీపూర్వ
జన్మమిట్లు, వెతల జెందగవలసెను విధియు నీకు, నొసటవ్రాసెను
నీవెట్లు లోర్వగలవు.

కీర్తన - రాగము

ఎంతవార్తమునిశేఖరా-నాకువేగ జెప్పుడి తేజభాస్కరా-ప్రేమతో
శ్రీహరి పాదపేట వెళ్లి - యేమికారణము యెందుకురాడాయే - ఇంతిరో
నేమని చెప్పుదు - నేనింత కాని దానికప్పుడు - సంతోషమునసే సరగున
నేగియు- కొంతరో విపినంబు గడియలో తిరిగితి-ఎక్కడాదరిసెనమాయెను-
వారెక్కడెక్కడ నివసించిరి-గ్రక్కున జెప్పుడి కన్నులజలములు మిక్కిలి
వచ్చెను యెక్కడబోదును - ఏమి చెప్పుదుగుహాలోనను వేగ ప్రేమతోడ
విహరించెలీలలు-భామినీతో గూడి మరు కేళిలో కలసి సుఖించెను - ఎంత
చేసెను-నారసింహుడునాతో పంతమాడిపోయె సీశుడు - చింతదోచె మది
యెంతకు తాళను-కాంతరో సవతిని గ్రక్కున దెత్తును - పౌలతిరో కుల
మంత చెఱచెను - దానిపొత్తులో భుజియించి యుండెను - చలము జేసిన
దానిసన్నిధికి బోదు - అలివేణియింటికి అతనిరానివ్వను-కులము లేనిదాని
చెప్పెను - నేను కలగన్నది నిజమాయెను - అలివేణులార మీరందరు
పదరమ్మ-తలుపు బిగియించి తగినట్లైవుండెద । నీతంత్రీవద్దకు నేఘుపిరా
లేక భూతేశుడు వస్తైపోట్లాడుమీ - ఏతంత్రమునకైన వెలదనివిడిపించ-
నాతిరో నామాటలు నమ్మబోకు నీవు - నావ్రాతఫలము యిట్లాయెనో-
వోనారిద యికనేమిసేతును - ఆవ్రాత దయ్యము అజుని వశముగాదు
నావ్రాతతీరున నాతండ్రీయిచ్చెను - చెంచువనిత బహునూ ధ్రువసి-దాని
చేపట్టకుంటేను మంచిది-వంచన జేయుకు పరుడని నమ్మకు చెప్పసరహాక
మంచివాడు కాడు-పతివ్రతధర్మంబు దప్పను- నాపతినేమందును యెట్లను-
అతులితప్రేమతో అతడు దానితో-నుండెగతియేమి చెప్పుడి - అమ్మరో
యికబోయి వత్తును-నీవు సమ్మతించకు సమ్మతి వచ్చును-నమ్మకు భద్రా
ద్రినాథుని మాటలు-కొమ్మ చెడ్డ బహుదిమ్మది నరసింహుడు.

లక్ష్మిమాట

క. దండము నయగుణసార, అండకునిటువచ్చినాదు అధిపులుమీరల్
నిండుగ పూజలు చేసెద, ఖండితములు ఆడలేను కాంతునితోడన్.

క. సేవలెనెవ్వరువో చెలి, కావలసినవారు నేనుకరుణతో వేగన్
ఆవలముచ్చటజెప్పితి, పోవలెనెను నేడునిలువ బాలతిరో వేగన్.

గీ. మౌళిశేఖర నరసింహామూర్తి యిట్లు, సవతియిటు దెచ్చునంచును
స్వప్నమందు నైన తెలియంగ లేదయ్యెనమ్మినాను బాపురే తంత్రి
సవతితో బాధతగదు.

నారదుని మాట

గీ. పోయివచ్చెద శ్రీలక్ష్మి ప్రొద్దుపోయె, చెంచువనితను గూడుకొ.
చెలియవిభుడు, మంచిగనువచ్చు వేగనుమరియుపోదు, నాతినరసింహ
మూర్తిని నమ్మదగదు.

వ. ఆసమయంబున నారదుండు లక్ష్మీదేవి యనుజ్ఞ వడసిపోయిన
తరువాత, చెలికత్తెలతో నేమనుచున్నది.

కీర్తన

చెలికత్తెలందరు వినరే నేను జెప్పెద మనములో గనరే – చల
ముతో యీచెంచువనితతో నరహరి కలికిరో వచ్చునట గట్టిగావినరమ్మా–
చెలి॥ దరవాజవద్దివారలకు మీరు తగ జెప్పండి యీవరకు। మరువ
కెప్పుడు మరివచ్చితేవారు మారుమాటాడక మరలి పొమ్మనరమ్మా ॥ చె॥
నేను జెప్పినాను వినుకొ చింతలెల్ల మాని మాట్లాడి। కొనిమాటలు
పలికి కాంతను వెళ్ళించి పూనిక స్వామిని రానిండిచ్చటికి ॥ చె॥ పవ్వళిం
చెదనేను విడిదికి మీరలింకవేగ చనుడి। ప్రొవ్వగాను మిమ్ముగొట్లాడ
కుంటేను। దవ్వుల భద్రాద్రిదాటి యించువచ్చె ॥ చె॥

వ ఆసమయంబున లక్ష్మీదేవి అందరికిజెప్పి తాను యేకాంత
గృహంబున శయ్యయందు బవ్వళించియుండెను, నరసింహుండు చెంచు
వనితతో నేమనుచున్నారు.

చ. ఎనయిక చెంచులక్ష్మి మన మిద్దరమిక్కడ నుండుటేమి
మావనమును పట్టము విడిచివచ్చితి నిచ్చట నిన్ను మెచ్చితిన్
చనుదుముకూడిపోదమిక చంచలనేత్రిరో ద్రోణమెక్కియున్
గనుగొన వేగగారుడము కన్నులపండుగు హంసగామినీ.

చెంచుమాట

ఉ. ఏమిర నారసింహ యిపు డిట్టుల బల్కెద వెఱ్ఱివాడవా
భూమిలో లేనిబొంకులను బొంకుట ధర్మమె వోరి దాసరీ
భూమియు నాకసంబు వినిపూనియు బల్కెదు కల్లలాడెనా
సామజవైరివిక్రముడ చాలును స్నేహము నిన్ను నమ్మితిన్.

కీర్తన

ఏందుకలిగినావే భామా యేమనంటినిన్ను - పొందుగా పోడము గరుడాద్రికి పొలతి వేగరావె । గరుడాద్రెందుకురా నరహరి కానిమాట లేమి సరగున బోడము చెంచులగూడెము సంశయమేలనురా॥ ఆపురిజూచుట బ్రహ్మకునైన అలవిగాదు చెలియా-గోపురంబు మేడలు మిద్దెలు గోమేధికములును । ఇంక యేమిగలవు నరహరి బొంకను నాతోను - యింత బుద్ధులు మానుమి నరహరి సంకటంబు తోచే । రథగజ తురగములు చెలియా రమ్యముతో గలవె - పృథ్వితురంగా భేరీ మోతలు పురుషులు బహుగలరే-యీరలువుండే గృహమున మంచివారెవ్వరా-పాలకుడెవ్వడు పురమేలేటి బలవంతుండెవడూ-రాజధాని మాకురమణిరాజున నేనడవె-తేజవంతుడను నారసింహుడను దేవదేవుడనే-నీకు బందులెవరు కలరా మాకు జెప్పవదేరా - జోకవిందుము చెంచువారల చోద్యమందగాను-సాగరుండు మామనాకు సవతిలక్ష్మినీకు - బాగుగ భక్తులు పదపడి వేవురు బంధువులుగలరే - సాగరుండు యెవడు నాకు సవతియెవ్వతెరా - బాగుగ జెప్పది చిత్తములోపల భ్రాంతితో చెందుకు । ఆదిలక్ష్మిభార్య పెద్దది అతివవో వినగదవె - మోదముతోడుత చిన్నభార్యవు మోహనాంగి రావె-ఎంత॥ మాయజేసినన్ను యెటుదెచ్చితివిరా - పంతముతోడుత భద్రాద్రీశుడ పలుకరాకునాతో.

నారసింహులమాట

గీ. పలుకరాకుమించి పలికేవు వోచెలి, నేరమేమి చెప్పు నాతి మాకు భయముదోచె మనసుపదపడి చెమటలు, కారుచున్న వదిగో తరుణిమేన.

చెంచువానిమాట

ఉ. మాటలు యేలనాడెదవు మర్మ మెఱుంగని వాడ నౌదునే
కూటము యివ్వబాల మరి కొంచవుగా సరి భార్యయుండగా
బూటక మేమి దుర్జనుడ పున్నమచంద్రుని వంటిదాననే
మాటల బుజ్జగించితివి మాతలిదండ్రుల బాసి యిద్యోడన్.

కీ ర్త న

తపసుల మాటకు భామరో తప్పులు బట్టితివా - ఇప్పుడు నాకు నీబుద్ధియున్నది పల్కెదనా - కొంచెపుదాన గనుమా నీవికమించవింత దేమొ - సంచితముగాదు చెంచుదానితో చలమువద్దు యనెను - దేవ చెంచులమీడి షుమ్మీ నే తేజవంతులము - వావిరిగా మాలక్ష్మీ దేవితో సమమువచ్చునంటి-అట్లనుండు వేగమాటలు యదియు చెప్పనేల-నీటుగ దెల్పర నీ తలిదండ్రుల నేను విందు బాగా॥ స్తంభము నందునను బుట్టితి స్తంభగలుడయేను - జృంభణంబు నాకు నివ్వావె శుభమునాకు మీకు॥ అదిపర మెవ్వడురా మాతండ్రియు జెప్ప వింటే- మోదముతోడు తమాత్స్యం బెవడు మేదినిలోపలనూ॥ దనుజుల వధియించ నేను సకదండి వరాహమైతి - దితిజునికొరకు నేను మత్స్యమైయుం బుధిలోనుంటి - మెట్టిరూప మెవడు పెట్టెను గట్టిగ వినవ్వా - అంటబట్టి యా కాశిపులల హాతము జేసెనెవడు॥ పొట్టిరూపమైతి బలిని కట్టి వేసినానె-అంటబట్టి యా కార్త వీర్యుల హతము జేసినానె - బలములగూడు కనువారిధి బంధించెనెవడు - హితముగ రావణాసురునిజంపు వానడుసి గాంచినాను॥ సనిని కొంచబోతే రావణు సంహారించినానె - హితముతో వాలిమనుజుని నేలిన యీశుడ నేనివే - మామను గొట్టించి యెవడో మరి యుదయములేక - కామ రూపుడై స్త్రీల వ్రతములు ఘనము జెరిచెనెవడు॥ మదము చేత మామనె వేగ మరణమైపాయ - ముదమున స్త్రీలకు బుద్ధిపుట్ట నేను వద్దయుండి నానె - పదిరూపులు నీవు యెత్తుట పరుల నిమిత్తముగా - ముదమునను జననమొందుట పదపడి విని చెప్పు॥ పుట్టించెడివాడు బ్రహ్మ భూమనుజుల వేగ - పట్టులేకను రక్షించేటి రమణి లక్ష్మీదేవి.

కం దా ర్థ ము లు

అలుగుట కారణమేమీ, కలువల దొరయేసె నన్ను కాంతరొ వేగమా, చులకనగ జూడకోసతి, పలుకులు మధురంబు లొలుక పలికి మితారీ-చలమేటికినాతొ పలుకుమితారీ, కులుకుగుబ్బలరొమ్ము ములుకు లొత్తుచునాతో పలుకుమితారి నాతోను కలికిమితారీ.

పగలునువగలును తెలిసెను, నగరముల చరియించెదాన నాతో నీకుమా, ఇగకూడిరతి సంగమము, పొదలుట నీకేమిపోర మొగమాట లేలా-మాయవాడ జగదీశ మేలా సుగుణవంతుడవని నగు మొగమును జూచి, దిగులుజెందక నీతోపగలు జేసితిగాని, మొగమాటలేలా.

నమ్మినవారిని చేరుట, సమ్మతిగానం(దు బుధులు సరసముతో డక్క కొమ్మరో రమ్మిక ముద్దుల, గుమ్మరో తానెపైడి బొమ్మకోరావు నామాటలు సమ్మతిగనవె నమ్మినీవు నారొమ్మునపవళించి గుమ్మపాలుదనుకు నమ్ములువే సెను, భామకోరావె.

అక్కడ నీసతియుండగ, ఎక్కడినాతో నపగలు చొక్కనమాటా, సొక్కుచు సొలుచువచ్చియు, నుక్కువతో పెండ్లియాడ మంచిదియటరా, దానితో మంచిమాటలుయేల యుంచిసయటరా.

భామరో నినువేగమ్మున, కోమలిమతి మంచిదటవె కోపములేదే, నీమోము జూచినప్పుడె, (ప్రేమతో నాచెల్లెలనుచు బెంచుకొన్నా, ఎత్తుక యన యమ్మవెనిన్ను, మంచిగా దలపించుమరి వ్రయ్యాలను గట్టివుంచి నన్నునిన్ను యూచునేదమ్మతోను పెంచుకొన్నా.

ఇద్దరు భార్యలతోనిక జద్దుగనీకేలపోర జీవంతుడవై, ముద్దుగ (బతుకకనాతో, రద్దుయునీకేలపోర రాజేంద్రవినుత, దానికినీకు తేజమేమనూరా, రాజిలే స్త్రీల రమ్మనిపిలుచుట, వ్యాజంబుగామరల రాకను పోపోరా రాజేంద్రవినుత.

అట్లనుటయేలవో సతి, చెల్లెల్లను దిరిగినన్ను జేపట్టితినే నెట్లను బాసలు జేసెద. ఇట్లనుటయు యేమినన్ను విడువనె భామా, దానితో నేను కూడనేలేదు, వేడుకలరగ తోడుకోడలవలె కూడియుండు నాకోమలి (మొక్కెద విడువనె భామా, దానితో నేను కూడలేను.

యతివరు డిప్పుడువచ్చితె, బతిమాలియు సతియుతోను బలుకక మనుచుక, గతిలేనివాని బాసలు, సతతము నమ్మంగరాదు జాలనుపోరా, దానితోనీకు మేలానుపోరా, మతిలేనివాడ గుర్మతితోడ వచ్చియు బతిమాలెదవురనన్ను హితవేమి నాతోను చాలను పోరా, దానితోనీకు మేలాను పోరా.

ఆసతినిక నేనొల్లను, దోసిలిలో పాలుబోతు తోయజనేత్రీ, బాసలు జేసెదవేగన పలుకులునమ్మంగవేమి పరమకల్యాణి, నీసరివారు లేరుపూబోణి, దూరము జూడుమిదొరసాని యికనీవు గూరిమితోనన్ను గూడకుంటేను తాళపరమ కల్యాణి, నీసరివారు లేరుపూబోణి.

ఎన్నెన్ని బాసలాడిన, తిన్ననినీమీద (భమలు తిరుగదుపోరా, ఉన్నది నీసతిమంచిది నన్నిటు (భమపెట్టరాకు సాగదు ఫలమూ,

ఉన్నదిపోర నా వ్రతఫలము, తిన్నగమాతండ్రి దీవించి మాదొరల సమ్మతితోనన్ను ఇచ్చునుపోరా, చిన్నబాలనునేను నానోము ఫలములే వున్నవిపోరా నావ్రాతఫలముపోరా.

ఒల్లను పసుపటిభార్యను నుల్లంబున నమ్మలేను యూరికె విపుడుఁగ్, కల్లరిసేతలుమానవె, చెల్లదుయీబుద్ధి నీకు చంచలనేత్రీ, మరుడు కోపగించె నేమిత్రీ. కాంచనపపరత్న కళలు గుల్కెటిమేడ మంచిగనున్నది మరివేగపోదాము చంచలనేత్రీ, మరుడు కోపగించె నేమిత్రీ.

నీ మాటలు బహు తేటలు నామాటకు దూరమాను నాతో నీకుఁగ్, ఏమాటలేదు పనియిక, ప్రేమతో భద్రాద్రిజేర వేగనుపోరా, యాదవదాసు సఖునేలగదరా, ప్రకటనతేజాడ నాకు పైడిమేడలుయేల, సుఖమియ్యరతికేళి సఖియవున్నదిపోర, యిక వేగపోర యాదవదాసు సఖులనేలగదరా.

వ. ఆసమయమందునమన్మథుండుతండ్రిమీద దయయుంచిచెంచు వనితయందు ప్రవేశించి నమ్ములు వేయుచుండె నెటువలెననిన.

గీ. మూర్ఛనొందుట పనియేమి మోహనాంగి, సతిని విడిచెదనం చును చాలసేవు, బాసచేసెద నంటినిపలుకవేమి నిందుబాసలు చేయుము నెమ్మదిగను.

నారసింహులమాట

క. పట్టెదపారెడి పాముల, గొట్టెద మృగరాజునైన కోమలివినవే మట్టెల్లజనులచూడక, గట్టిగ అలంబువదలి కన్నులగనుమీ.

గీ. పాలునన్నంబుతోడుత బాససలిపి, యుండునెప్పుడు నీతోను నూర్జిత ముగ ఆదిలక్ష్మియు మదిలోన నమరినాది, క్రీడసలిపెదనీతోను పడతివినవె.

వ. ఆసమయంబున నారసింహులు బాస సలిపినంతలో చెంచు వనిత యేమనుచున్నది.

కీర్తన వాదము

నీభార్యయే పాటినీతిమంతులాలో నారసింహా – నేనుయేపాపమెరు గని ఇంతిరోవినరోరి నారసిం॥ దానితోను నీకు తగవు లేదుసుమ్మి చంచ లాక్షీ – దేశగయ్యాళని చెప్పగవింటిరా నారసింహా – నీ ఆశదానిమీద అమరియున్నది పోర నార॥ విడిచినదానికి హితమెందుకురావె చం॥ నీవు

నడిచేటి త్రోవనే నడచెటివాడను చం॥ అక్కడకేగియు అతివతోనీవ్రందు
నార-నేచక్కగ ప్రాణము గ్రక్కసకికత్తు తార॥ ఖాసలునమ్మ వేపణతిరో
మ్రొక్కెద చంచ - నీవుగాసినొందకనను కదుణింప వేసతి చంచ॥ నమ్మి
వచ్చెదనేను సమయములో బోదమునార-మాయమ్మ గూడుక మాతండ్రి
వచ్చును నాక॥ అత్తమామలువస్తె యతిప్రేమజూతునె చంచ - నేను
సత్తుగ భద్రాద్రి స్వామిని చూడవే చెంచలాక్షి॥

కీర్తన

రావె చంద్రవదన చెంచుల రాణ హంసగమన - రావే రాజుల చేతి
కఠారి రావె రాజసచిలుక॥ పోదము పదపయ్యా [illegible] పురికి-
సాధుజనులు సన్నుతి జేయగ సకలజనులు పొగడ॥ [illegible] జల్తారు
పట్టు పుట్టముదగో - [illegible] నెలత దాల్చుకోవే॥
ఎందుకు మాకీకను నరహరి [illegible] - ఉందము గాదసి [illegible] హాసము
చేయును యదిక్రోధముతోను॥ [illegible] మన్నది
ధరియించు - మన్ననతో [illegible] ఆణిముత్యములు [illegible] దాల్చుకోవే॥
సొమ్ములేల మాకు నరహరి పలునమ్ములు పట్టితిని - సమ్మతితో దుత
సవతినిజూచితె చాలబాధ వచ్చు॥ పాణుల కంకణములు చెలియ మరి
మరి ధరియించు - ఝుణ ఝుణ మ్రోసెడి కాళ్ళందియలు చెలియ దాల్చు
కోవే॥ యాభరణంబులనూ మేము యిటుల ధరియించెదమూ - గాబర
జెందును మముసవతిచూచితె॥ ఘడియలో వేగమునా యేమి భయము
నీకు - చెలియరో వెలదిరో ధరియించు భామా॥ పోదాము భద్రాద్రికిని
పైన మైనానూ - ఇదిగోపోద మిపుడు నరహరి వేగిరమున లెండి - పదపడి
యాదవ దాసుడు వేగమె పలుకు చుండునయ్యా॥

వ. అనుసమయంబున నారసింహులు చెంచువనితను తోడుకొని
గరుడాద్రికి నెటువలె వచ్చెను.

చ. మృగముల జూచుకొంచు బహుమందర సేనలు తేజమొందగా
ఖగములు నీలకంఠములు గారుడ పక్షులుకాంచనంబులు
బుగురును జెందపుష్పలును బుక్కయునీరును జల్లుకొంచునా
మగువతో మేలమాడుచును మందిరధీరుడు నారసింహులు.

గీ. అనుచు నీలాగుసరసంబు లాడుకొనుచు జనగ గరుడాద్రిశిఖరంబు
గాన వచ్చె సంతసిల్లుచు నరహరిస్వామి నగరిజేరె ప్రజలెల్ల
విభవము జెందిరపుడు.

వ. ఆసమయంబున పురజనులు స్వామివారికి వందనంబులు చేసి కానుకనర్పించి చెంచువనితనుజూచి ఆశ్చర్యంబు జెందుచుండ నగరిద్వారంబుకడకు జనినంతలో స్వామివందనంబు జేసినిలిచి యేమనుచున్నారు.

క. దండము నరహరిస్వామికి, దండము రిపుకోటినెల్ల దగ్ధము జేసెన్ జండబలిశయనుడవేగమె, నిండుగవచ్చితిరి పూజ నేసలిపెదసూ.

నరసింహులుమాట

గీ. ద్వారమును వేయుపనియేమి ద్వారపాల, దీవ్రవేగంబెపొయ్యె దత్వరితముగను, నాల యేంద్లాయెనేపోయి స్వామివేగ, ఆది లక్ష్మిని చూడగా నిడిగా వస్తి.

కీర్తన

వేటమార్గమందుబోయి వేగిరించగాను—బూటకమాయెను రాకడ జూచి బుద్ధికశలతాను — మీకుపనియేమిరా నేటిముచ్చట లడుగుటకు— రాకుమంచును యెవరుచెప్పిరి రంతులు జేసెదరు॥ రంతులు యేమయ్యా చెంచురమణిని దెచ్చితిరి — గంతులు వేయుచు వచ్చియు మాతోగారడ మూడెదరు॥ కండ్లకుమదమెక్కి మీరు కానిమాటలన్ని — చెంచువేసిన రీతిగానాడేరు చెప్పవశముగాదు— ఆదిలక్ష్మినివిడిచి మమ్మునందరినివిడిచి— మోదముతోడుత చెంచువనితతో మొనసిక్కడేమి—దొరను నేనుగానరోరి దొంగమాటలేమి — మీరిక పలికితె శంకజేసెద నోరు ముయ్యరోరి॥ దొరలును మీరైతె నిటువలె దొంగకార్యమేమి — దూరమునచూడుడి యాదిలక్ష్మియుమాకు చెప్పినటుజేసెదము — వాదమేమిమాతో మీకు వారి జాతివినకు — తలుపు తియ్యనీకు నేమిదగవు జెప్పుమాకు — చలము జేసితె నారసింహుడను చంపివేతునిన్ను — ఇటుల యనుటయేమి పొండి యందరువొద్దికన—కల్లమాటలు మాతో యేమి కరుణచేయరయ్య — బుద్ధిదెచ్చుకొండి వారు రద్దిచేయకండి — హద్దుగ భద్రాద్రిశుడ నేనిక యాజ్ఞ మీరకండి.

వ. ఆ సమయంబున నారసింహులు చెంచువనితయు కవాటంబు దీసిన నతడు నంతరంబులో పలికినేగి లక్ష్మి పవళించిన అంతః పురంబు కడకుపోయి నారసింహులు యేమనుచున్నారు.

కీర్తన—సంవాదము

మంచివాడవని మాతండ్రి నన్నిచ్చె నారసింహా — నీవు కొంచె గాడవని కోరితెలియదు నారసింహా॥ మంచివాడనుగాక మరియేమి

చేసితి నిప్పుడు శేగ ఆగిలక్ష్మి॥ ఇప్పుడు వనితాను దెచ్చితివందుకు నీవు-
వనిత మెచ్చుడు లేదు వారిజాక్షిరో చూడు ఆది॥ నీవు కావించి చిలుకాకు
రమణిరో భయమాయె ఆది॥ భయమేల నీకిక పగలియుండగాను నార-
నీకు నయముతో దాచికేదు నాకిదుంచితిసుమ్మి నార॥ ఎక్కడబోదునే
దిక్కెవరిక నాకు ఆది॥ నీవు దక్కినభాగ్యవు దిక్కునీకెసుమ్మి ఆది -
ఎందుకుజెప్పేవు వెలది చెంచుబోటినార॥ అది పొందుకుదాంకెను ప్రొద్దు
పోయెసుమ్మి నార॥ తప్పులు మన్నించి దయతోను జూడవే ఆది॥ నీ
చేంతనేనిలిచియు చెప్పినపని చేతు ఆది॥ తెలిసెను నీబుద్ధి ధీమంతు
డవయ్యా నార॥ దాన్ని కలిసివచ్చి నాతోకలహము జేసేవు నార॥ఇంత
కోపమేల యుంతిరో నేనుంటి ఆది॥ నీవు చెప్పిన వన్నెవదు దగ్గరతీసేదు
ఆది – పుట్టినప్పుడెతల్లి వ్రాసినదుచంటిదే నార-నీతోరట్లు లేకపోవు నా
వ్రాతఫలమేమి నార॥ నీవు లేకుంటేను నేను బ్రతకలేను ఆది – నన్ను
కావుమీ బ్రోవుమీ కరిసంబేల ఆది – అందరిని రక్షించే యాదివిష్ణువు
నీవు నార॥ నాతోపొందు నీకేటికి పొలతిమంచిది సుమ్మి నార॥ నీవుచెప్పిన
పనులు నేను జేసెదాను ఆది॥ నీవు కావుమీ నన్నిక కరుణతో జూడవె
ఆది॥ ఇంతకంటె పనియిక యేమిచేసేదు నార॥ చెంచు కాంతున్నది
కరుణతో బోరయ్య నార॥ చెంచుదిగాడది నీకు చెల్లెలుకావలె ఆది-
నీవు మంచిగాచూడవే మగువ చిన్నబాల ఆది॥ కులము గోత్రములేని
కోమలి నిటుదెచ్చి నార॥ దానికులములో గలసియు కలియవచ్చునేమి
నార॥ మరికులమె కాని మరి వేరొకటిలేదు ఆది॥ నీవు అనుమాన పడక
యాదరించవె దాన్ని ఆది – అనుకున్న కార్యము ఆయెను యీవేళ నార॥
నా మానము బోయ్యేటటు మగువను దెస్తివి నార॥ తప్పులు మన్నించి
దయతోను యేలవె ఆది॥ ఇక చెప్పనేలను భద్రాద్రిశైల రామేశుడ
నారసింహా॥

తలుపు తీసే పాట

కలికి కవాటము బంధన జేసిన కారణమేమేలక్ష్మి – నీకు కారణ
మేమెలక్ష్మి॥ కారణమేమని యడిగేవ్ర నీమది తెలియగ లేదటవోయి –
స్వామి తెలియక లేదటవోయి॥ తెలిసి తెలిసి యేచెంత చేరితి వంతమేల
నీకు వంత – పరిమాంత్మా నీకు వంతము లేటికి వదర వద్దువోయి, స్వామి-
చెంచితయనిమదిచింత జేసేవు-చింత యేలనీకు చిం॥ కొం చెపుజాతి చెంచిత
నాకు చవితి యనుచువింటేరా – నాకు చవితియు॥ కలికికవాటము దెర

చిన యపుడు యీ కంఠహారమిత్తు - నీకంఠహారము చెంచితకిచ్చి చెంచితనూడుము స్వామి - ఆ చెంచితగూ॥ జిలుకుటాకుల నారచీరలు దెస్తిని జేకొనవేమే లక్ష్మి - నన్ను చేకొన్న॥ జిలుగుటాకులు చీరెలు దెచ్చితే చెంచితకిచ్చి రావోయిస్వామి - చెంచిత కిచ్చిరా॥ మల్లెపువ్వుల దండలు తెస్తిని మగువరో గైకొనవేమేలక్ష్మి - మగువరో గైకొన॥ మల్లెపువ్వుల దండలు తెచ్చితె మగువకిచ్చి రావోయి - స్వామి మగువకిచ్చి॥ ఇప్ప పువ్వుల దెస్తిని యికనైనను కనుగొనవేమెలక్ష్మి - ఇకనైనను॥ ఇప్పపువ్వులు చెంచితకిచ్చికీర్తిగొనవోయి స్వామి-ఇచ్చికీర్తి॥ కటిమేఘములమున గండభేరుండము తరిమిగాసి పడితినేల-తరిమిగాసి॥ గాసి గాసితిరుగుటకు చెంచిత దోడ్కొనిగరుడాద్రి పోవోయిస్వామి - గరుడాద్రిపోవోయి॥ దండిగతప్పులు చేసితినిప్పుడు దండమైన చేకొనవెలక్ష్మి- దండమైన పెండ్లికొమారుండై గనుపడుచునా దీవెనలివిగోస్వామి - నాదీవెనలివిగోస్వామి॥ శరణుశరణు శ్రీలక్ష్మి శరణు శరణు-శరణు యిందిరా॥ నవ్వుచు శ్రీరామవాకిలి దీసెదగట్టిగానురావోయిస్వామి-గట్టిగానురావోయి॥ మదనజనకుడు మగువనుదోడ్కొని - మందిరమునకు నేగునూ॥

లక్ష్మిదేవిమాట

గీ॥ చేడెలారవినుడి చేసినతప్పును । ఓర్వజాల వింటునుండ నిచట
తలుపుదీసినేను తండ్రివద్దకుబోదు॥ యుండజాలనమ్మ యువిదలారా॥

వ. ఆ సమయంబున చెలికత్తెలు దరువాజ తీసినంతలో నారసింహులు చని లక్ష్మిదేవిని యాలింగనముచేసి యేమనుచున్నాడు.

దేవివినవేడివింతులేవే॥ దే॥ దేవివినవే నేదివింతులేవే ధీరులమెరయనూ- కావుమమ్మ నన్నీ కరుణజూడవెసతి॥ దే॥ కోపమేలదాపు నీవేయీపని చేసితే యికయెటుబోదును-రూపు జేయలేవె తరుణిరో ప్రెుక్కెద॥ దే॥ అయినపనికి అలసటయేమేపైనమైపో తెఫలముదొరికెనునాకె-నీవుదయతోను రక్షించి కరుణించి కృపజూడు ॥ దే॥ కలజెప్పలేదా కలిగెనుచాలా చలమేలమ్రొక్కెద సతినీకుదక్కెర - చెలియరో దయజూడు చెల్లెలువచ్చెను ॥ దే॥ చిన్నబాలవన్నె నేలవున్నాది యెదురంగా అన్నము పెట్టవె - కన్నతండ్రినిబాసి నిన్ను నేలెనుగోల ॥ దే॥ భద్రాగమ సుభద్రావినవె యద్రిజనుతలెమ్మ భద్రాద్రిపోదాము - ముద్రాంచితనీకు నిద్రాయెందుకువచ్చె॥

వ. ఆసమయంబున లక్ష్మిదేవి లేవకుంటె నారసింహులేమనుచున్నాడు.

గీ॥ నిన్ను నమ్మి వచ్చితి నీరజాక్ష। నన్ను కృపసేయు కిట్లుంటె నాతియెవరు। దయను జేసేవు నీకును దండమిదిగో। తప్పులన్నియు క్షమియించు తలిరుబోణి॥

వ. అప్పుడు లక్ష్మీదేవి లేచి కూర్చున్నంతలో చెంచుదాన్ని దండంబు నిడుమని అనుటలో యేమనుచున్నది.

క॥ దండంబు బెట్టుమటంచును। ఖండిత వాక్యంబదేల కరుణతో నీవుఁ। నిండుగ మ్రొక్కెదవానికి। నుండగనే నిచట సురలి యూరకె పోదుఁ॥

లక్ష్మీదేవి మాట

గీ॥ చెంచుదానవు నీకింత శేలుసూతె। మోరినావంచు బలికేవు యోర్వజాల। మళ్ళిపలికితె మర్దింతు మగువవినవె। దేశగయ్యాళి చెడివచ్చి తిరుగుదానా॥

చెంచుదాని మాట

గీ॥ చెంచుదాననంచు చెడివచ్చితినటంచు। పలుకుచూను తెలియ భవ్యమగున। పెద్దదానవంచు ప్రియునిచే కాళ్ళకు। మ్రొక్క జేసితౌనె మగడు కాడె॥

కీర్తన - వాదము

చెంచుదాన అడవితిరిగి వచ్చినావా - నీవు మంచిగానె చెట్టెక్కి పాట్లాడెవవా॥ చెంచుకులము మాదిగనుక చెప్పవచ్చెదవే - చెలియా చెంచువాడు కాదె మగడు జెప్పనేలనే॥ మందూలు దగిలించి నీవు మాటలాడెదవా - సఖియా పొందవలసిచ్చినావా నిందూ దెలిసెనే॥ విభుడునను గూడినాడు విడిచిపెట్టవే - నాకు అభయమిచ్చితోడుకొని అందుబోదునె॥ కులము లేనిదానితో వాడు గూడెనా - చెలియా నీవు కులముగలవాన్ని మగని చూడవెదకి - అందుకొరకేముంది మొగలానంటి వచ్చితివే॥ నీవు యెందుబోక యిందుపచ్చి యెటుజేసెదవే - కొంచెమైనసిగ్గు లేదె కోమలి నీకూ॥ వేగముంచిడని సంపాదించి మగుడిపొయ్యెదవే - యడవులన్ని తిరిగి మృగములంత బట్టుచు - నీకు కడుపు లేదె చెంచుకులము సమసిపోనికనూ॥ నీది కులముయేది జెప్పుమీ నీచదానవే - చెలియా మోదముతో ముజ్జగమూలు మొయ్యగాగలవే - అడవితిరిగి పచ్చనాకులంటగట్టుకా - నీవుకుడి మోసిన బ్రతికేవా తె గూంత లేటికే - ఇంటింటికి తిరిగెదవు యేటిదానవే నీవు - అంటబెట్టి ప్రజలనెల్ల ఘాతము శేసేవే॥ విల్లుబట్టి బాణములచే విరుగనేసేవు - కల్లని యాసఖియ నీవు కానిపోగదవే॥ పొమ్మని పలికేవు నన్ను పొలతి ఎక్క-

డికే-సమ్మతితో బయలువెళ్ళ జాలమెవ్వరిచే ॥ ఇంత జేసె నారసింహులు యింతిని దెచ్చి - నన్ను పంతముతో పొమ్మనుచు పలుకుచున్నాది - భద్రాద్రీశుడంటె నేమి భయమే చెలియా - మాకు భద్రమిచ్చి జేయుదనుచు బలుకుచున్నాడే॥

వ. లక్ష్మీదేవి యేమనుచున్నది.

గీ॥ చెడియువచ్చు దాన చెడిపోయెమాటలు । నోడ దెరిచికోని నోర్చు లేమి
గానినిన్ను నా దురాత్ముడుచూడడా । ఏమిసేయగలడె యిందువదనా॥

చెంచుదాని మాట

ఉ॥ కొట్టెపనంచుబల్కెదవు కోమలి నీవునుయాడుదాననే
పుట్టియు గొట్టివేగమున ముందరనున్నడు నారహసింహులుక్
దిట్టములేక నన్నుమరి దీనతదెచ్చును బల్కులాడియుక్
చుట్టము వీడుగాడెమరి చూచెద వెందుకు చోద్యమందుక్॥

కీర్తన-సంవాదము

పురుషుడెక్కడను దొరకక పూనివచ్చినావె - మురియుచుముందుగన వచ్చినదానవు మురిపెముడిగిపోవె॥ భ్రమనుజెంది తెచ్చి చెలియా నాతో పలుకులాడకు-నాతో భ్రమలువుడిగెను మీరిప్పుడు పంతమేల బోవే॥ దిమ్మరివై నీవు దేవుని దిట్టవచ్చినావె - దొమ్మరిదానవు చెంచుదానవు దొంగదానవోవే॥ దొమ్మరి దానవై తేను మగడు డోలుకొట్టుతాడే - సమ్మతితో డుత గడలుమోసేటి సానినీవటవె॥ కులములేనిదాన మాటలు కొదువయేలనీకు-చెలగుచు అడవుల తిరిగెడిదానను చెప్పరాకు నీవె॥ జ్యేష్ఠదేవిభంగిని నీవు చెప్పుకున్న వేమి-కష్ట పెట్టుటను ప్రజలనెల్లను కానిమాట లేమే॥ పుట్టకుక్కలాను మృగముల పూనితిన్న దానా - పట్టిపక్షులు జంటితేనెలు కలియతిన్నదానా॥ పుట్టినదిజలధిలో పుట్టలేదు నీవు - పట్టుచుపాముల మొండ్రకాయలు పట్టలేదె నీవు॥ ఒంటిగ దిరుగుచును నరహరి నొక్కనిగా జూచి - ఆడంబట్టుక పురుషుండంటను అంటవచ్చినావె॥ అట్లుగాదువినవే బ్రహ్మ అరుంధతిగూడ - నట్లులేకను పెండ్లిజేసిరి నన్ను అనుటయేమి॥ పెండ్లి జేసితేను నీవు కండ్లగానకను - గ్రుడ్డిరీతిగ మాటలుబలికెవు పండ్లనువిదళింతు॥ బొక్కినోటిదాన మాటలు యెక్కసమాడకువె - చుక్కబొట్టును కాలకొట్టుతా వెక్కరించుటేమే॥ గొట్టెదనిక రావు నీదుకొప్పు బట్టితిని - చుట్టము నీకును నారసింహులు

చూచుచుండు చెలియా॥ కొప్పుబట్టి తేను నిన్ను కొట్టకుంటమా నే-చెప్పు కో భద్రాద్రీశుడున్నడు చెడివచ్చినదానా॥

వ. ఆసమయంబున నారసింహులు లేచివచ్చి యేమనుచున్నారు.

సీ సా ర్ధ ము

పెద్దదానవునీవు బిడియంబులేకను యీలాగుబోతివి యేమనంగు గురిగురుత్వము లేదు కోమలి చెడ్డది అనరాదు పకరాదు అతివవినవే యడవిలోదిరుగుచు హద్దులేక నెపెరిగి తెలియరోదానికి తేజమలర తల్లిదండ్రులబాపి తగబంధువుల బాసి మనలాను నమ్మివచ్చేను ఆమగువనేమి అనబోకు మదము హెచ్చును వినుమీ । నీవిందరిలో ఘనతకు నెక్కినావు । మనసులో వంతవలదు మరినన్ను చూడవే చెలియా॥

వ. నరసింహులు చెంచులక్ష్మితో నేమనుచున్నారు.

ఏమెచంచలాక్షి యిట్లుపలికెదవేమె నీకంటెపెద్దది నీరజాక్షి
ఎన్నడాడనిమాట యిట్లుపలికెదవేమె దోషంబువచ్చునే తోయజాక్షి
అక్కరోరమ్మని యాలింగనము జేసి మొక్కుచునుండవే మోహనాంగి
పనులుచేయుచునీవు భక్తితోనుండుమి, నామాటవినవే చెంచీతా -
ప్రేమతోనిన్ను భామయు కౌగలించునా, నేమముదప్పబోకు నీమనో హరుడనేను, సోమునివంటి మోము భామరో చూడగదవె, నామాట వినవే చెంచితా॥

వ. అప్పుడు చెంచిత యేమనుచున్నది.

క. పెద్దదియనుచు జెప్పెదు, బుద్ధియు దానెందునీకు బోధించెడినో,
ముద్దులు మరువదునిన్నును, బుద్ధేయిక జూడునీకు బుద్ధియు లేదా॥

గీ॥ చిన్నదానవంచుచిగురుబోణియంచు, నన్నుమాటలాడనయముగదవె
అన్నివినుచునుంట అతడున్నడే చెలి, చిన్నతనమునీదిచిదుముగాను.

కీ ర్త న - వా ద ము

వినవయ్య శ్రీనరసింహదాసుని అనరాని మాటలగను-మామనసులో భయమును మఱియింతయును లేదు - పనిబూని కొట్టుటకు సైవెమె వదిచూడు ॥వి॥ వింటివానరసింహదేవ దాని వెంటబెట్టుక పొమ్ము వేగ - కంటగించి బిత్తరికతినంబులాడుచు పంతైనజగముల మంటిలోగలిపేది - ఎంతో యున్నతురాలవటవె జగమంతమాయలు జేసితివటవే-కాంతరో నాతో కలహించరాకుమీ చింతరాదికనిన్ను వంతబాపెదడుచూ ॥వి॥

కొట్టుమనుచు చెప్పినాడె నీ దిట్టతనమికపోవే - కట్టుకున్న చీర ప్రక్కన విడిచియు చెట్లెల్లఁ దిరిగేవు పట్టిమూర్ఖురాల॥వి॥అభిమాన మింతైన లేదే సిగ్గునంత విడిచివచ్చినావె - సభవారు నిను జూచి చాల దిట్టెదరింక యిభరాజవరదుండు విడిచిపెట్టెను నన్ను ॥వి॥ సిగ్గులజ్జయు నీకు లేదు కనులుచీయునె నిక బుద్ధిరాదె - తగ్గదె దేహంబు ప్రగ్గలమైనది మొగ్గులేని దాన వేమందు నిన్నిక॥ ఎక్కడనుండివచ్చితి వెనక్క కూతలు యేలనుపోవె - అక్కయనుచు నేను నడిగితి నిందాక మక్కువతో దెబ్బమాటయు దీసికొంటి॥ వి॥ కొట్టి నరక్తమునే బట్టిమళ్ళి గొల్లైన రక్తము చేపట్టి పట్టితి నేనిక - బలువైన యీయాయుధము పట్టు లేక నిన్ను నరికివేసెద చూడు ॥వి॥ బాణాహస్తురాల నేను నిను బడవేతు రణమందు - బాణహస్తురాల నాతో సుగెలి చేవరాపించినావిభుడు నాదిక్కువుండెను ॥వి॥ ఎక్కడిభూతంబు నేను విభుడు వెంటబెట్టుక వచ్చినాడు - అక్కరో యని నన్ను అనరాకనొట్టైవను-నొక్కసారంటివి యోర్చియుంటినిగాన - నడినిన్ను బిలిచితె నేమిచప్పు పులినీవు - ఈ సారి హెచ్చు కన్నతండ్రితోను అన్ని మాటలుజెప్పి - నిన్ను గొట్టించెద నన్ను తిట్టితివేమి॥వి॥ నన్ను కొట్టెడువారెవ్వరె నాకన్న మిక్కిలి యున్నవారె - అన్ని వింటివి నీవు హా భద్రాచలవాస - నన్ను తాంగికి సంతోషమాయెను॥

వ. నారసింహులు యేమనుచున్నాడు.

గీ॥ ఎంతనిక నేను జెప్పుదు నింతులార । ప్రజలుమిము జూచిన వ్వారు పణతు
లార । జగడమును మానియుండరే జాణలార । తెలిసెమీ ప్రజ్ఞ జగ
మంత తేటపడగ॥

కీర్తన

చాలించుడిక మీరు కయ్యము నాచేతగాదు అసహ్యాము - పాలించరే నన్ను పణతులార మీరు లాలించి కూడరే రంతులు మానరే ॥చా॥ ఇది యేమె శ్రీలక్ష్మి వినవే అది యేమి చెంచిత గనవే - పదపడినుంటిరే పైడి మేడలమీద ఆడరాని జగడ మాడుట యేమి ॥చా॥ ఎంతకైన నేనుంటినే నీకింత కోపము యేల - చింత నేకాంతరో పువ్వుల బంతులాడుచును - అంతకు నుందాము అది యేమి జగడము ॥చా॥ భద్రాద్రి నరహరి నేడుగరా మీకు భయము లేక నిట్లు నొదిగెరా - క్షుద్రదానవులను మర్దించినాడను రుద్రవినుతుడాను భద్రమిచ్చేదాను ॥చా॥

లక్ష్మీదేవి - మాట

గీ॥ ఎన్నిమాటలు బడితిని నినకు లేశ । కన్నతండ్రికి జెప్పరా కడకుబోయి।
నీమపగదీర్చ నీభార్యనిర్వహించ । కానిమాటలుబలికేవ కరుణలేక॥
గీ॥ అన్నిమాటలుపేవలె నాడలేనె।కొండెగాడని నిభుషనిగొట్టలేన । మంచి
వాడైతె తెలియును మఱియునిన్ను। ఏమిసేయుదు నీకుణాంబెఱుగవచ్చె॥

కీర్తన - సవతుల వాదము

చెంచుదాన మాటలాడకె నీచెక్కిలి వేయింతు ఝుడియాకే ॥ఓసి॥ ఆదిలక్ష్మివాని మురియాకే నీవంతరంగమున నాడకె నా పొటికిదినక వచ్చేవా నీపాటిదాన గావచ్చేనా॥ మంచిమాటలాడవేమికా నిన్నువంచించివేసెద చూడుమికా॥ ఖర్జూరపండ్లకు వేగమె గవ్వకాసుకు దెచ్చినట్లాయెనే - అంగూరుపండ్లకు వేగమే నిన్ను అందించినట్లాయనే - నారింజ ఫలముకు వేగమే నక్క నమ్మి వచ్చినట్టులాయెనే - బూరుగ ఫలముకు వేగమే చిల్కపూని వచ్చినటులాయెనే - జానిమ్మ ఫలముకు వేగమే వైరిదాసరి వచ్చినటులాయెనే ॥కోపమువచ్చును వేగమె నిన్ను కొట్టకుంటె నేతాళనే కొట్టితే నేనూరకుందునె మల్లికొట్టి బొక్కపెట్టనే ॥జగములన్ని అడవి పెట్టినే భూగగనములు బొబ్బలుబెట్టెనే-గజమువచ్చిసింహరాజునూ వేగ కఱచిచంపినట్లాయనే ॥గరుడునిమీదికి శేషుడు వేగకదలివచ్చినట్లాయనే॥ రాయంచమీదికి బకమువచ్చి రంతులు చేసినట్లాయెనే। భానునిమీదికి శునకము వేగ వంలుబెట్టి నటులాయెనే। అద్దమునుజూచి కోతియు వేగమే అందరువచ్చినటులాయెనే ॥భయమేమినాకిక పోగదే నా పంతంబెల్లనురాగదే - వరభద్రాచల వాసుడు వింటేను నాకువరమిచ్చె నిక నేమంటావు - దాసులందఱునన్ను కొల్తురె నీకుదండంబు సహితముపెట్టరె - కరుణతో యాదవదాసుడు మమ్ము కలిసియుండునే సుఖవాసుడు॥

నార-గీ॥ ఏమి శ్రీలక్ష్మి నాతోడు వేరుయేలె । కోపమెందుకు వచ్చెనే కోమలాంగి। పేటకుపోయి చోటను వెలదివినుమా।తడవ్రమాయెను దరవాజ తలుపు తెరువు॥

గీ॥ మాటలాడవు నాతోను మందగమన । శలవులిచ్చితె నేపోతి చంద్రవదన।
ఇంతకఠినంబు లేలనే యిందువదన। భామ నీవాడనాతోను పలుక వేమి॥

కీర్తన

కలికి లేవే పలుకవు ఏమె మొలకా నవ్వులముద్దుచిలుకా మితారి॥ పల్లవి॥ మృదువైనమాటల ముదితాయిచ్చోట - సదయతపలుకుమి సర

సముతోను ॥క॥ మదపతిరావె వదలను లేవే - ముదముతో నేవచ్చిముద్దు లియ్యవే॥క॥ భ్రమదీర దేకలికిరో లేవే క్రమమున భద్రాద్రికాంతుడ నేనె॥

సీ॥ శ్రీలక్ష్మి యికనీవు చిన్నబోవుటయేమె కాంతరో నీతోడు గలసినాను
నీమీది భ్రమచేత నేనిందువస్తిని తప్పేమి నామీద తలిరుబోణి
బంగారుచాయల పట్టుపుట్టము జార కౌగలింతునురావె కరుణతోడ
అంగన నామీద అతిప్రేమదప్పినా శృంగారములబంతి చూడవేమే

గీ॥ మదను డమ్ముసెనీమీద మనసుకలిగె । కోదను తుమ్మెద గములను కోమలాంగి । ప్రేమయదోణగెను దిగులొందె మోసపోతి । తలుపు యికదీవె తరుణిరో తాళజాలా॥

వ. చెంచువనిత యేమనుచున్నది.

కీర్తన-సంవాదము

ఎంతవ్యర్థుడవు నేమందునేనిన్ను నారసింహా - ఆ కాంతను బతిమాల కర్మమేమిర నీకు నారసింహా॥ అట్లనకికనీవు నావలనుండవె చంచలాక్షి - ఈ పట్లమాట్లాడకు పణతికోపమువచ్చు చంచలాక్షి॥ అతివయందునీకు అతిప్రేమకలదుర నార॥ నీవుకూరిమివాడ జెప్పకుంటె నాతోడు నార॥ నోరుమూసుక నీవు ఊరకనుండవె చంచ- కోరినేజెప్పెదను నేరము లెంచకు చంచ॥ నన్నుదెచ్చితి నే నాయుసురంటదా నార-నీవు యెన్నెన్ని బాసలు యెందుకు జేసితి నార॥ చేసితేనేమిట చెడిపోయె జెప్పవేమి చంచ- గాసినొందుటయేమి కడుసంతసిల్లవె చంచ॥ నీవువిడిచితెనంత విరివిగ వేగమె నార - నీవుపడతి పంతమాడి బతిమాలెదవేమి నార॥ యెప్పటి మాటలు అంటనీయక చాలుచంచ - నా తప్పులెంచకు దండముపెట్టెద చంచ॥ తప్పివచ్చితినేను తలపోయమేనేడు నార - నాతండ్రివచ్చెనే తగవేగబోదును నార॥ తలపోతలెందుకు దయతోను నుండవె చంచ - అది కలసిన తరువాత నణగికూడుదాము చంచ॥ ఇట్లని తెలియక యిటువచ్చితినిగద నార - మాడలాడకు నీవు మాయలవాడవు నార॥ నాతిరో భద్రాద్రి నరసింహుడను నేను చంచ - నీతో ప్రీతిగనుండు బింకాము వీలనే॥ చంచలాక్షి॥

వ. ఆ సమయంబున చెంచువనితను సంధించి లక్ష్మితో నేమనుచున్నాడు.

ప ం చ చా మ ర ము

ఏమిలక్ష్మి లేవవింక యెంతకాని పిలువనే
కాముడేమొ యేసెనిన్ను తుణములోను చూడవే
భూమిలోన నెవరులేరు పుణ్యస్త్రీలు నీవలెన్
కోమలీరో మ్రొక్కెదాను కోపమేల లేవవే॥

ల క్ష్మి మా ట

క॥ దండము నెందుకు బెట్టెదు। దండిగ నీభార్యతోను తగయుండుపు యో
కుండలిశయనుడ చాలును। నండకు రాకుండ పొందీ యతివనుగూడన్॥

స్వా మి మా ట

గీ॥ నిండు వేడుకతోడుత నీరజాక్షి । యుండవ స్త్రీని నన్నిక పొందవన్న ।
యుండలేనిక నినుబాసి యోర్వజాల । ఖండితంబులు చాలించి
కమలనేత్రి॥

గీ॥ ఏలయుందును మిమ్ముల వెలదులార। యింత కఠినంబు లాడుట యెందు
లేదు। ప్రేమ లేదాయె నామీద ప్రియుడనేను । వందనంబులు సలిపెద
వాడు లేల॥

కీ ర్త న

ఎంతజెప్పినగాని సుంతయిన వినరేమి వెలదులార-ఓకాంతలారా
యిక కలహమెందుకురారె భామలార॥ ప్రేమతో నాకిక పూజలుసే
యరె ప్రేమతోను-మిమ్ము ఏమనియుందును నింత భయములేదే కాంత
లార - తెచ్చినదానవు చెప్పినట్టు వినుచంచ - మంచిగ మాట్లాడు మగు
వతో నెప్పుడు ఆది । భద్రాద్రివాసుడు పతియగు మీకిక భామ-మీకు
భద్రములిచ్చెద బాయకనుండరె భామలారా॥

వ, లక్ష్మితో మాటలాడి చెంచువనితను నోడుకొనిపోయి దం
డంబు బెట్టించి యేమనుచున్నాడు,

క॥ చిన్నది పంద్రెండేండ్లది । మన్నించవె చెల్లెలిదిగో మాటలుచాలున్
ఎన్నడు రతిసుఖ మెరుగదు। చిన్ననిమ్మరు వాక్యములను జెలియబిలువవే

వ, లక్ష్మిదేవి చెంచుదాని నేమని పిలుస్తున్నది,

గీ॥ రావె చెంచిరమణి రావె రత్నపుబంతి । రావె రాజహంస రంతు
వలదు । కూడియుండి నాతో కుటిలమ దేలనే । మాటమీరకుండ
మదినిచెల్లి॥

వ. ఆ సమయమున చెంచులక్ష్మికి వందనములు చేసి యాలింగనము చేసి యేమనుచున్నది.

సీ॥ అక్క నీవునన్ను నాదరించుమి వేగ।మొక్కుచుందు నమ్మ మోహనాంగి। పక్కజాయ కెపుడు ప్రాణేశు తోడుత। మరియుచుందు నమ్మ ముద్దుగుమ్మ॥

వ. ఆసమయంబున సవతులు కలిసియున్న తరువాత,

క॥ చెంచులను గూడికొనినే। వేంచేసితి దొరను నీకు వినుర జెప్పెదర్ మించితిజగములనామము; మంచిగ శిఖనాయకుండ మటివేద్యుండర్

శిఖనాయకుండురాకడ - కీర్తన

శ్రీమించు చెంచుల శిఖనాయకుండాను- భీముండరా పరంధాముండరా శ్రీ॥ జంభారిదో స్తంభ గంభీరమాగునట్టి - కుంభిని మీదను గూల్చెదరా॥ శ్రీ॥ అంభో జగద్భవి కుంభిని నాధుని - అంబరంబున వేసి యాడుదురా ॥శ్రీ॥ సారంగములబట్టి బాణశిలలవేసి - జారంగ నిన్వక చంపుదురా ॥శ్రీ॥ శూర మహిషంబుల కంటకంబులచేత - బాణంబులతో నేను బడ వేతురా ॥శ్రీ॥ ఏడేకుకోలను మెక్కి దుమికెదము-కోడె సర్పంబుల కొట్టుదురా॥శ్రీ॥ దండిదానవులను గుంపులో బాణము-లుండజేసి నేను ఖండించెద ॥శ్రీ॥ కొండలు బిలములు నింకుపొదలుజూచి-దండి సింహముల దరిమెదరా ॥శ్రీ॥ భద్రాచలేశుని బాయకుండెదరా-భద్రాచలుసేవ బట్టెదరా ॥శ్రీ॥

ద్వారపాలకునిమాట

గీ॥ ఉరుకులాడుచు వచ్చెనవుర్వి తాను। నిలువజాలవుధీరుడా నీవుయెవరు కులగోత్రము పేరును గొనకునీది।గ్రామమెక్కడ జెప్పుము గనబడేమి॥

ద్విపద

ద్వారపాలకవినుము శూరుడను నేను-మేరుధీరుండను మేదినియందు నాగ్రామమడిగితి నయమొప్పగాను - యేగ్రామమునుగాదు యెలమితో నాది - జంటెగూడెము మాది జెప్పవశమా ని - మించును తేజంబు మిన్నందుచుండ - యెంచశక్యముగాదు యెవ్వరికయిన - చెంచురాజును నేను శిఖనాయకుండ-మంచివేటనునేడు మటియాడబోయి-ద్రుంచితి గజసింహ సంచయములను-నదిగాక వినరోరి యిది యొక మాట-ముదముతో జెంచులు పదిలక్షలూను - పదపడి వేటకు పోయివచ్చెదము - నదులు

పల్లెలుపట్న మాదటదిరిగి - బంగారుబొమ్మంటి పణతినాబిడ్డ - శృంగారములబంతి చూడలేనైతి - సంగతిబాసెను సర్వకల్యాణి - చెంగల్వపూబంతి చేజెనాబాల॥

ద్వారపాలకనిమాట

గీ॥ దండిదొరవయ్య చెంచులతాతవయ్య। అబ్బనీమాట వింటేను అడవిపడితి। గుండెజడిసెను వినవలె గూర్మితోడ। నామరూపంబులనుజెప్పునాకువేగ॥

ఉ॥ వీరలగూడినన్నుగ వింపుమ జెప్పెదనోరి ద్వారకా
దూరము చూచుకొమ్మనిన డుంకులుబుట్టను భ్రాంతిజెందకో
నేడుపుతోడ విసర నీకునుజెప్పెద నామనామముల్
కూరిమితోడ తప్పటను గుండెలజంకకు మాటబల్కకు॥

సీ॥ అర్కజుండితడును కర్కశుండతడును శాపుకుండితడును గర్గదంష్ట్రు
తీవ్రముఖుండును దీర్ఘరోముండును భల్లూకముఖుడును భద్రముఖుడు
తేజవంతుండును దివ్యదేహుండును గంభీర నాదుండు।గంధకరుడు
కర్కోటకుండును ఘుంటనాదుండును వ్యాఘ్రముఖుండును నిగ్రహుండు॥
సముడుశ్యాముండు ఝుంకారవీరు డంష్ట్రు। బింకవరుడనన్ను భీముడంష్ట్రు। మంకునామము వాడు మరిసర్పనేత్రుడు। వినరద్వారపాల వీరిపేళ్ళు॥

క॥ వింటిని వీరలనామము। కంటిని మీ రూపునేను కన్నులనిండన్॥
అంటనుదొరగవచ్చితి।కంటకమిదియేమి చెపుడు కరుణతోవేగన్॥

చెంచుశిఖివాయకునిమాట - త్రిశ్ర

కరుణతోవినర నీవు ద్వారపాలక - యాకలకంఠి జూడలేద ద్వారపాలక - నవరత్నముల దాపినబంతిని ద్వార॥ నన్ను తగవిడిచి బాయనిబిడ్డ ద్వా - వేటమార్గముదాల్చె ద్వా - దానివెంట నెవ్వరులేరు ద్వా - కంటకాన కడవిలోన ద్వా - బాల యొంటిగా బోయెనిపుడు ద్వా॥ చిన్నబాలనన్ను విడిచె ద్వా - శామనామ తేజంబుగుల్కు ద్వా॥ తల్లి తండ్రులాను బాసె ద్వా - యికతల్లడించేదిమనసు ద్వా॥ భద్రగిరినారసింహులు ద్వా। తాను పాడటమేలానే ద్వా॥ భద్రములిచ్చేటి బాల ద్వా - నేనుబాధలాశ తాళజాల ద్వారపాలక॥

వ. ఆసమయంబున భటులతో నేమనుచున్నాడు.

ఉ॥ చూడుడి వేగసుందరిని సుస్థిరులై యిలనెల్ల వేగమున్
జాడలబొంది సిప్పుడును జాణతనంబున పర్వతంబునన్
నీడలవృక్షమూలములనిండుకొలంకుల నేటిపొంతలన్
వేడుక జూచి రండికను వేరును జేయక బాలతోడుతన్॥

వ. ఆసమయంబున భటులుతిరిగివచ్చి వేసారి చెంచునాయకునితో నేమనుచున్నారు.

సీ॥ కొండలుగుహాలును నిండుపొదళ్లను గుండుమీదను జేరిచూతిలిడియు నదులుపట్నంబులు నానావిషయములు పొదరెండ్ల పొకలును పూలచెట్లు। సరసంపుతీవలు చంపకపున్నాగ జాజీరసాలాది జాముననము పులిసింహా శార్దూల భూతంబు లన్నియు కలయ జూచితి మయ్య కానలేదు॥

గీ॥ తిరిగివచ్చినాము దినమంత రాత్రియు। కలియ జూచినాము కలికిలేదు। యెందుబోయె నేమొ యెవరుగొంపోయిరో। తెలియలేదు చెంచుధీవరేణ్య॥

కీర్తన

చెంచు నాయక వినుమా మేముచెప్పెదమింకొకటివినుమా– అరణ్యమందున అతివనుయెవ్వరో మంచిగగొనిపోయి మాయంబుజేసిరి ॥చెం॥ తండికొండా గుహాలయందు నెవ్వరో తగయుండిరిదినే మంచి–పండుటాకులతోను పచ్చానిపందిళ్ళు నిండుగతోరణాలు మెండుగాగలవయ్యా– పాలునేతులతోను పసువుకుంకమ చుక్క– ఎలమితో గలవయ్యా నీలకంఠపుచుక్క–పెరుమాళ్ళు తోడనయ్యా వినుడి బాల పెండ్లి చేసుకొనెకనుడి॥ కరుణా తో భద్రాద్రి కమలనాభుండును నరుగుదెంచెనేమో నాకేమి తెలియదు ॥ చెంచు॥

ఉ॥ ఎవ్వడు ఏగుదెంచె పరుడెవ్వడు వచ్చెను నాదుబిడ్డనున్
యెవ్వడు పెండ్లి యాడెనిక యెట్టులు దేలదు ద్రుంచివేసెదన్
చివ్వకు వచ్చితిన్ వినర జీవనమెల్లను నెట్లుజేయునో
యివ్వగ లెట్లుబోవు మఱియిక్కడ నక్కడ జాడదీయుడీ॥

కీర్తన

అదిగో మీరుచూడండి దొర అడుగులున్నావి – పదపడి వేగమె నిపుడు పరీక్ష జేయండి॥ యెందుగలవో చూపరోయి నరుగ జెప్ప॥

మేము - పొందుగాను జూపిదాను పొలతియుమగులు - సః పెంగపొదలా దారిచవిరి జూడుమీ - వేగకంపా మొందగా నిక్కడను కలయాతిరిగి - నిజముతో చినాడి మనలోని నీవు చూడోయి - వేగిరంబని తేపలెాశావచ్చు నారీమణి చూడవోయి! రాక్షసులుగాదు రాజరాజు తెన్గ్లనో - కుక్షిణ ముందున పెండ్లియాడి సిపుకనేరి - ఎందుబోయి చూడనోయి వేరము నను - యిపుడు అందరము క్రోధముతోను [illegible] - శలిపతు లిద్దరుకూడి నడచినారు - సత్యామే రాజవేగ హితసత్యతోను - గడుగు లున్నావి యిదిగో చూడండి - శత్రోదయంబు పోతుంది యిదిగో చూడండి - వేగప్రీతితోను వానిద్రుంచి నాతిని దెత్తు - శత్రోవ గరుడా ద్రికి నిపుడు బోతుంది - రాజప్రీతితోను నారసింహులు వరకవచ్చును - నన్ను వెలియక నారసింహులు నాతిని - గూడియున్నారు భద్రాద్రి యందు నోర్వజాలను॥

వ. ఆ సమయంబున చెంచు శిఖినాయకుండు గరుడాద్రి కేతెంచి నగరి ద్వారంబు కడకేగి అక్కడనున్న ద్వారకుని చూచి యేమను చున్నాడు.

ఉ॥ ఏమిర ద్వారపాలకుడ యెందుకు విడ్చితి ద్వారమిప్పుడున్
భూమిలో లేని కార్యములు పూనిక నేసియు గర్వమొందియున్
స్వామియటంచు దాసరికి సారతలేకను నాడు పుత్రికిన్
ప్రేమయులేక తెచ్చెనిక పెంచితి ముద్దుల రామచిల్కనున్॥

వ. అని యాగ్రహించి తదనంతరంబున ద్వారపాలకులు ఏమను చున్నారు,

గీ॥ ఏమిపనియును తెలియదు యిపుడు మేము।స్వామి తోడుత జెప్పియు సన్నుతించి। వచ్చెదము కాని మీరిందు వదరబోకు దుముక బోకుడి చెంచులు దుడుకుతనమూ॥

వ. ఆ సమయంబున ద్వారపాలకులు స్వామివద్దకుబోయియేమను చున్నారు.

వినవయ్యా గరుడాద్రి దేవా చెంచువీరులు వచ్చిరిడా - కనవయ్యా మమ్ముల కఠినంబులాడుచు పనిబూని బాణముల పదవేతు మనిరయ్యా। నాయకుని కూతురటయ్యా అన్యాయమై బటుదెచ్చు టేమి - సాయకం బులచేత యేమిపనియు జేసితిరి - లక్ష్మియెంతవద్దన్న పోతిరి కదనమందున వారు ఘనరాక్షసులజంపి - పగసాటివచ్చిరి పడవేయ మిమ్ముల ॥విన॥

దిద్ది తేదోషమురా - భూసురవందిత వాసవహితుడాను - ఆసించిన నేను
కాసై నవియ్యనా॥ చెంచులతో నీకు వాదమా భళీ - మించి తెలుసుకో వినో
దమా - మంచురీతిగను నుంచితి బాణములు - అంచితతూణములు మించితి
గావురా॥ కుంభినిమీదను గూల్చెద రాజుల - జంభారిహితుడను గూల్చె
దరా - గంభీరముగ నేను గుంభిని బాణములు - దంభోళి ప్రారంభమిక నేజే
సెద - జంటానీవు నా బంటువుగాని బంటూని నేను నన్ను కావర - నీవు మా
జాతిపిల్లాను మరి యెట్లు దెస్తివి వినర॥ జగమంత మాకుటుంబము రా కంకీ
వేటిగ నిప్పంటిన రీతిగ జంటాగ బాణములు వెంటాను వచ్చెరా॥ భద్రాద్రి
వాసుడ గర్వించేవా సముద్రములోపల నిండించెవా - ముద్రవాంఛితు
డాను భద్రము జేసె క్షుద్రదానవుల మర్దించువాడను॥

నారసింహుల మాట

చ॥ ఆడవులు దిర్గుచుఁ మరియు నాకులు నల్లముతించు వచ్చియుఁ
ఝుడియక మాటలాడెదవు ఝంకృతితోడుత నిన్ను ద్రుంచెదఁ
మిడుగుచు మళ్ళిపోర యిక మీసరివారలు చెంచులందఱుఁ
అడుగులు చూచి మ్రొక్కెదను ఆందఱికంటెను పెద్దవాడరా॥

శిఖినాయకుడు

ఉ॥ దాసరి వెఱ్ఱివాడవుర దైన్య మెఱుంగక నాదు బాలికఁ
మోసము చేత తెచ్చితివి ముందర వచ్చెదు గీడుగానకఁ
భూసురనాథులుఁ మఱియు పూజలు జేతురటంచు బల్కెదో
కాసుకుగాని నాసరవి కానక చూడర నాదు ప్రజ్ఞలుఁ॥

కీర్తన - వాదము

ఏమి చేసేవురా కిరాతక ఎట్లు బలికెదవురా - భామను యియ్యను
నెంత జెప్పిన బ్రతిమాలిననువినరా॥ ఎటుల జేసితివిరా బాలను నెందు దెచ్చితి
విరా - కల్లమాటలు నాతో పలికేవు కాని చూచెదవురా॥ దేవదేవుడ
నురా నేనిక దీనపోషకుడనురా - భావములోపల భయము లేకను పలుకు
చుండెదనురా - దేవుడవై తేను మాచెంచు దేవర వానివు - కావర మందిటను
దెచ్చియు కలహము జేసెదవా - మత్స్యరూపమునను సోమకు నెంచి ద్రుంచ
లేదా - తెచ్చిన విద్యలు బ్రహ్మకునిచ్చి మళ్ళి రాను లేదా ॥ మత్స్యమునీ
వైతె మేమిక మచ్చుకుబోవనిమ్మా - యిచ్చతో తింటుము విడిచిపెట్టక
వినర॥ హరి నీవు కూర్మరూపమునను వీపున కొండ మొయ్య లేదా - పేర్మితో

సుధయు పలుకునిచ్చి పెంపు జేయ లేదా। సురల యుద్ధమందు నీవిక గరుడు నెక్కి-వస్తే-సరసన బలియు గదచే ద్రుంచి వ స్తిసనగ లేదా॥ వరాహరూపమునను రాక్షసవధ జేయగ లేదా - గరిమతో భూమియు నెప్పటట్లుగా గనుపరచగ లేదా॥ పందివై తెలెస్సువింయు పంతముతోడు తనూ - అందముతోడుత మాకులధర్మము నెందుకదరి పడెనవు॥ నార సింహుడనురా నిన్ను నమలక మ్రింగెదరా - కూరిమి లేక హిరణ్యాక శిపు సినే గోళ్ళజీర లేదా॥ నరసింహుడవై తె చెంచునాయకుండు నేను కూరిమి తోడుత కాలుచాచితి నమ్మక మరిబోకు॥ వామనుండనయ్యా బలిని వంచి వెయ్య లేదా - క్షేమతో నింద్రునికి రాజ్యమిచ్చియు పెంపు జేయు లేదా॥ భిక్ష మెత్తలేదా జగములో బిడియము లేకనురా - శాంతుతో భూమియు నిచ్చినజనుల కట్టివెయ్య లేదా॥ పరశురాముండనై రాజుల బలముతో ద్రుంచితిని-విరసము లేకను మాతో మీరు వివకద్రుంచెదరా॥ తండ్రిని జంపి తేనునీవిక గాండ్రతనముతోను-చండముతోడుత చంపితివంటూ వేగిర పడబోకు॥ శ్రీరాముడనయ్యా నేను శీఘ్రుతరంబునను - ఆరావణు ద్రుంచి లంకనపుడు విభీషణునికిచ్చితిరా। యేమి జెప్పెదవురా సీతను నెత్తివాడనీవు-ప్రేమలేకను చెరలోనుంచి పెంపు జేయ లేదా-బలరాముడనయ్యా రాజుల బలము ద్రుంచితిరా - యిలభారంబును మాన్పితినేనిక వీరు డనుకోరా॥ చెప్పెద వేమినను కంసుడు చాల వేగిరమున-తప్పక తల్లిదండ్రిని కెఱలోన తగనుంచగ లేదా॥ బుద్ధరూపమునను జగములో సిద్ధమయినాను - వాదు ఏమినాతో నీకువాద్దిగపోరా॥ బుద్ధపామరుండు శ్రీ బుద్ధి జెరుప లేదా - ముద్దుగ జెప్పెదరా నీగుణమంతయు ముందు తెలిసిపోరా॥ కలికిరూపమయ్యా జగ ములు ఘనముగ రక్షింతు - తాళుర భద్రాచలేశుడ యాదవ దాసుని నలితిరా॥ కులములేనివాడ నీలో గుణము నిర్వికారా - గలమేటికిరా మగువనియ్యరా సాగిపొయ్యెదాము॥

వ. నారసింహులు యేమనుచున్నారు.

క॥ యేటికి మాయక్రోధము। యేటికిధైర్యమ్ముజగము నింతట నేనుᴂ।
నాటిన దేవుడ వినరా। బోటిని నే నియ్యపోరా బొంకులునాటᴂ॥

చెం చు దా ని మా ట

గీ. వేటగావచ్చి బాలను వెత్తివాడ। తెచ్చుటిది యేమి ధర్మంబు తేజమగున
కాసుకైనను కొఱగాని కఠినుడీవు। బోటిదానను నాతోడ బొంకవేల

నారసింహుల మాట

క॥ నాసరి యెవ్వరు జగములో । దాశరి యేమనుచు నీవు తగబలికెదరా
కూసము విడిచిన సర్పము ।దోసమ్ముల నెపగబోదు తొలగియుపోరా॥

కీర్తన - వాదము

నాతోను నీకేమిన్యాయము వినరోరి నారసింహా - నీకు కూతు రియ్యకూతలేటికిపోర నారసింహా॥ కూతురు నీకేల ప్రీతితో చేకొంటి చెంచునాథ - ఇక కూతో నీకేమి మాటలేలనుపోర చెంచునాథ॥ ఏజాతి వాడర యెరుగను నిన్నిక నార-నీవు కూజాతికిల్లాను మరియెట్లు దెస్తివి నార॥ జగమంత నొక జాతిచెప్ప నేమిటికిపోర చెం-ఇక బుగులేమి నాకిక పూజొరిణి నియ్యాఁర చెంచు॥ భార్యయుండగ నీవు పణతిని దెచ్చుట నార॥ ఆది భార్యము కాదుర కలహ మొందుటకుపోర నార॥ భార్యాయుంటే నేమి బ్రహ్మాదు లుంటేమి చెంచు-వేగ ఆర్యులు మెచ్చిరి అతివనియ్యను పోర చెంచు॥ దానితోడను పొందు జేసినవాడవునార - దోసకాడ పసిబాలను తెస్తివో నార॥ కంసునిదాసి గ్రక్కున పరమిస్తే చెంచు- కంసునివేగమే హింసజేయలేద చెం॥ వలచినదానిని వడిముక్కు చెవులు నార - నీవు పిలిచికొయ్యవె బిడియంబులేకను నార॥ దానవి నడిగెను రండి రతికేళి కని చెం॥ నేనుమానక కోసితిని మరియాద దక్కను చెం॥ పొట్టకు లేకను పిట్టరెంగిలిని నార - నేగట్టి వాడనని పట్టుకోపడుతావు నార॥ ఘనమైనభక్తిచే కడుమంచిఫలము చెం॥ సన్నుతిజేసియు శబరి శీఘ్రమె యిచ్చె చెం॥ పాలునెయ్యి గొల్ల పణతుల యిండ్లలో నార-నీవు మేలు దొంగిలించి చాలగ దినలేద నా॥ దొంగతనము కాదు అంగనలు నన్ను చెం॥ జ్యేష్ఠదేవిని వేగ చేకొనకను నీవు నార॥ వేగయిష్టముతో లక్ష్మి నెట్లు చేకొంటివి నార॥ అడిగేటివారికి నొప్పగించినాను చెం - ఇక జడియక నాతోను కలహమొందుకు పోర ॥చెం॥ మరిమరి చెప్పితే మురియుచూ బలికేవు నార - నేను గరిమతో యుద్ధము సరగున జేసెద నార॥ అదిగో భద్రాద్రి నరహరి రూపుడ చెం॥ నీవు సరగున నాదు రూపము మురియుచు జూడరా చెంచునాథ।

నారసింహుల మాట

క॥ దురమును చేసెద నాతో।గరిమతో నారూపుజూడు కార్ముక జ్వాలల్
సరగున జూచితె దెలియును।ధరణిలో నిను ద్రుంచివేతు తాత్పర్యమునన్॥

చెంచునాయకుని మాట

క॥ బెదరుచు మాటలుపలికెదు।పదపడితగరూపుగుణము పరమాత్ముడవై
ముదమున బాలను దెచ్చితి।వది రేవది మంచిదార వారి జనాభ॥

వ. ఆ సమయమున నరహరి అలరుద్రాకారుండై విశ్వరూపంబు చూపి నెటువలె ననిన.

విశ్వరూపమిదిగో - చెంచునాథ విశ్వమయుడ నిదిగో - విశ్వరూపుడ నేను విశదంబుతోడుత-అశ్వగజంబుల అన్ని నాయందునూ - విశ్వ - నక్షత్రంబుల నుంచితి - దేహంబును నానావిధములాను - కాంతుతోచూడుము కమలాసనుడు నాకు నర్థులైయుండిరి అమరులు నాయందు - సప్తసాగరంబులు నాయందు - సప్త పర్వతంబులు సప్త ద్వీపంబులు - సరసముగ జగజగములు సప్తఋషులునాతో సఖ్యతతో నుండిరి॥ అమరులు రాక్షసులు నాయందును ఆదిత్యమునివరులు - క్రమమున గరుడపక్షి సింహంబులు నమరుచున్నారు చూడుము దశదిక్కులు వేగ॥ బ్రహ్మరుద్రులు నారదులు చూడర నవబ్రహ్మఋషి వరులును - బ్రహ్మాండమంతయు పదపడి నిలిపితి - జిహ్వలు సహస్రశేషుడ నైతిని॥ భద్రాద్రి నాథుడరా భద్రయాదవ భక్తునికిచ్చితి - అద్రిజనుతుడాను యుద్ధము నాతో పదపడిచేసేవు అమరేంద్ర వినుతుడా॥ విశ్వ

వ. ఆసమయంబున చెంచుశిఖనాయకుడు చెంచుసేనలు భయంబు నొంది భక్తిమార్గంబున చెంచునాయకుం డేమనుచున్నాడు.

గీ॥ ఆది దేవుడ వినవయ్య అమరవినుత । వందనంబులు నీకిక వనరుహాక్ష
తప్పులన్నియు క్షమియించు ధరణినాథ।దాసులము మేము పాలించు
దాతవయ్య.

వ. ఆసమయంబున నారసింహులు విశ్వరూపము చాలించి చెంచువారిని తనగృహంబునకు తోడ్కొనిపోయె. అటనంతరంబున శిఖనాయకుండు లక్ష్మిదేవికి వందనంబులు జేసెతదుపరిలక్ష్మిదేవి యేమనుచున్నది.

గీ॥ చెంచునాయక వినవయ్య చెప్పెదను । బంధుడవు మాకునిక వంత
చెందకయ్య । బాలయిదినాకు చెల్లెలు పదిలముగను। ఇదిగో చెప్పితి
నేహరి యెదురుగాను॥

శిఖనాయకుని మాట

క॥ తల్లివి జగములకెల్లను । చెల్లెలు నాబిడ్డనీకు జెప్పగ నేలా
యల్లుడు నాకును నరహరి।యుల్లములో నమ్మినాను నోర్వుము తల్లీ॥

### కీర్తన - వాదము

నీబిడ్డనావద్ద నేప్పుతోనుండెను - చెం చు॥ నీకు నేబిడ్డనైతిని నీకేమి భయమయ్యె చెంచు॥ ఆదిలక్ష్మినీవు అల్లినబోకమ్మ తల్లినీవు - వేగవాద ముతోడు ముజ్జగములకెల్ల మూలమీవు॥ అల్లుడు ఆమెను ఆదిపర బ్రహ్మంబు చెం॥ జగమెల్ల నీదాయెను చెప్పనీకేమి చెంచు॥ చెల్లెలు చిన్నాది చెప్పకోబుద్దులు ఆది-అది కల్లలాడినగాని కరుణతో నేలుమి ఆది కాయతీగెకునగ్గు గావించు నాచెం - నేవేయువిధంబులు వెలదిని పెంచెద చెం॥ దండమునీకిక దయవుంచు నామీద ఆది-ఇక యుండు నీయింట అండబాసెనుచాల అది॥ వ్యాకులమెందుకు నాకుబిడ్డగాదాచెం - ఇక జోకతో చెంచుది నీ కేమి ఖేదంబె చెం - చిన్ననాటనుండి నన్నువిడువ లేదు ఆది - ఇక యున్నా నీవద్దమన్నించు మ్రొక్కెద అది॥ అన్నిటికిని నేను వున్నానుచింతేమి చెం - నివేకన్నాను కడుపులకంటి కన్నులచెం॥ భద్రాద్రి నరహరి పతిమీకు గలడమ్మ ఆది - ఓభద్రగమనరో భక్త లాము మేము ఆదిలక్ష్మి॥

వ. ఆసమయంబున శిఖనాయకుండు తనబిడ్డను దగ్గరదీసి ముద్దిడి ఆలింగనముచేసి జలంబులు నేత్రంబులందు గ్రమ్మ లక్ష్మిదేవి చేతితో తుడిచి వందనంబులు జేయించి, యొప్పగించి బిడ్డకునేమని చెప్పుచున్నారు.

సీ॥ అమ్మరోవినవమ్మ ఆదిలక్ష్మియు నీకు అక్కగాదుతల్లి నిక్కము గను
యాజ్ఞలోనుండియు యతిప్రేమతోడుత పనులు చేయుచునుండు పద్మ
గంధిమారు మాటాడక మరిధిక్కరించక పాదము చేరియు భక్తితోడ
నాథుడని నరహరిని నమ్మబోకుము తల్లి భయము తోడుతనీవు॥

గీ॥ పరగనుండు - నేవచేయుము పతిసేవ జేసి తేను-పుణ్యఫలమొందె దవు
నీవు పువ్వుబోణి - మమ్ముదలచి దుఃఖించకు మఱియు వలదు। చిన్న
బోకుము నాతల్లి చంద్రవదన॥

వ. ఆసమయంబున కొమార్తెకు బుద్ధులుచెప్పి నరసింహస్వామి కొప్పగించి యేమనుచున్నాడు.

గీ॥ తప్పులన్నియు మన్నించి దయనుజూడు। మూర్ఖురాలయ్య నాబిడ్డ
ముదముతోడ। కోపగించియు మీరిన కొట్టవలదు। బుద్ధిజెప్పియు
నుంచుకో భువనచరిత॥

నారసింహుల మాట

గీ॥ ఎందుకీమాటలాడేవు ఇపుడు నీవు। మందహాసముతోడుత మమ్ము జూడు॥భయమును జెందియు సేమందు పణతితోడ। మర్మభేదంబు లేదిక మాట వినుమా.

వ. ఆ సమయంబున చెంచునాయకునికి కట్నంబులిచ్చి విందుసలిపి మన్నించి సాగనంపినిలిచె తదనంతరంబున చెంచులక్ష్మి తనతండ్రితో నేమనుచున్నది.

కీర్తన

నాతండ్రి నను విడిచి పోతావా-నీవు నను జూడ మఱుడివస్తావా - ప్రేమతో చెల్లెంద్ర యేతీరుచూతును-నాతల్లి తమ్ములు మఱిసన్నుతల చేరు-నా॥ ఎన్నాళ్లు ఉందువు ఇక్కడ తల్లి యెంతదుఃఖించిన నక్కడ - ఇన్నాళ్ళనలె మఱచివీడలేను నిన్ను అన్నముగనదయ్యు అతి ప్రేమతోడుత. నా॥ చిన్నబోకు తండ్రి నీవిక వేగనన్ను దోడుకపొమ్ము నీవిక- చిన్నది చెల్లెనన్ను విడువలేదు - యెన్నడుచూతును యేమిసేయుదు తండ్రినా॥ వర భద్రాచలమంటిని వేగనరహరి ప్రియుని చేకొంటిని-వరణశీల బరువు గాను నీకు కరుణతో పుట్టినయటుల గనుగొనవచ్చెద నాతం॥

వ. మఱియు నేమనుచున్నది.

ఉ. బొమ్మలు రాజహంసలును బొంగరము ల్బహునాడు చుంటినో
యమ్మనుపిల్ల గాంద్రకును నందఱినిఁ జెలిక త్తెలందఱిఁ
సమ్మతితో సుఖంబడిగి సన్నుతి జేసితి నంచుబల్కు వే
అమ్మను సడ్గివచ్చెదను నానతినివ్వుడి మీరు వేగముఁ॥

వ. ఆసమయమున శిఖనాయకుం డేమనుచున్నాడు.

గీ॥ అప్పయుండుమ యొప్పుల కుప్పవమ్మ। మళ్ళివచ్చేము బంధులు మఱియుతల్లి। అందరమువచ్చి దోడుకయతివ నిన్ను। పొమ్మెదము గాన నీవుండుపువ్వుబోణి॥

వ. ఆసమయంబున బిడ్డను సముదాయించి శిఖనాయకుండు అందఱి యనుజ్ఞవడసి తనజనులను వెంబడించుకొని పోయిన తదనంతరంబున లక్ష్మి నరసింహులు చెంచులక్ష్మి సుఖముగానుండిరంత.

మంగళహారతి

మంగళం పన్నగశయనా నారసింహా మంగళం - కమలలోచన మంగళం - శ్రీరంగశౌరి మదనజనక మ్రొక్కెదను - పొంగుచును చెలులు మీకు మంగళారతులు నివ్వారె "మం" దేవదేవ మీకు మ్రొక్కెద శ్రీలక్ష్మి చెంచుతోపి మొదలు సీతిదేవమా - నమ్మినాము భక్తులాము మీకు దేవ - కావు వేగ లక్ష్మీనాధ కరుణజూడు మ్రొక్కెదాము "2" సకలమునులు సన్నుతించగా దేవతలంత ప్రకటముగ ప్రస్తుతించగా - ముదముగాను భక్తజనులు యిక పూజలుసల్పి సకల భాగ్యముల నిచ్చి సుఖముతోను నన్ను కావు "3" వరభద్రాచల వాసుడ యాదవ దాసుక మొఱవిను పరవాసుడ - కరుణతో నన్నుగావు చరణములు నమ్మినాను - వరములిచ్చి యేలవయ్య దొరవో శ్రీరమాపతి "3"

లాలిలక్ష్మీజగదీశ రమ్యచరిత । లాలిమృదుభాష దీనపోషరమ్యాహార
లాలిపట్టాభిషేక శ్రీరమణీతోడ । నిద్రజెందుమడి భద్రాద్రినిర్మలచరిత॥

క. జోజో యినకులధీశుడ । జోజో నరసింహా దేవ జోజోశౌరి
జోజో రాక్షస సంహార । జోజో నరసింహా దేవ జోరఘురామా.

క. ఈకధవిన్ననుప్రాసిన।భూకాంతుడు లక్ష్మి విభుడు పురహాసఖుడుక
జోకతో మోక్షమునిచ్చును।సాకల్యముతోడ బ్రోచుసాధులనెల్లన్॥

చ॥ ధరణిలో యాదవాఖ్యుడను దండి నృసింహుని సచ్చరిత్రముక
మురియుచు చెప్పితిక వినుడి ముప్పదిరెండు నాలలోపలక
సరగున లక్ష్మీనాధుడును సాధుజనంబుల భక్తులందరిక
కరుణతో బ్రోవు భద్రగిరి కాంతుడు దాసుల చిత్తహాసుడై॥

గరుడాచల నాటకము - యక్షగానము

సంపూర్ణము.



ఎస్. వి. గోపాల్ అండ్ కో.,

పి. బి. నెం. 74,—63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మదరాసు-1.

---

# కామకల్పతరువు

ఇది పలురకములతో, మలయాళీ పద్ధతిలో తయారుచేయబడినది. స్త్రీ పురుషులకు కలుగు అన్ని వ్యాధులకు దివ్యౌషధము. రుచికరమైనది. పత్యములేదు. సర్వకాలములందును భుజింపదగినది.

హస్తప్రయోగాది దురభ్యాసములవల్లనూ అధికమైన ఉష్ణమువలననూ వీర్యం పలుచనై సంభోగసుఖాన్ని పోగొట్టుతూనుచు, శీఘ్రస్ఖలనం మున్నగు స్వప్నస్ఖలనం రోగాలచే పీడితులగుదురు.

ఈ రసాయనమును, పుచ్చుకొని జీవసరములలో చేరివచ్చిన మహాదుర్నీరు నశించును. స్త్రీసంభోగముచే నేర్పడిన తెలుపు, సెగ, గ్రంథి, మేహవ్యాధి మేహదురద, పిత్తపాండు, క్షయ, కాసలు పోగొట్టును. వీనిలో సాటి వేరొకటి లేదు. దురభ్యాసములవలన [హస్తప్రయోగాదులచే] సర్వావయవము దుర్బలమై చిక్కిపోవును. వేడి, బలహీనము, ధాతునష్టము, స్వప్న స్ఖలితము, నరముల బలహీనత, ఆయాసము, దేహాభీతి ఆకలి లేకుండుట, మలబద్ధకం, గుల్మము, అజీర్ణం, నిద్రలేకుండుట, మేహకాక, రక్తము చెడుటచే గల్గు వ్యాధులు మూలకాక, గుండె దడ, వెన్నునొప్పి, దగ్గు, ఇంద్రియము నీరైమూత్రములో పోవుట, స్త్రీలతో చేరిన వెంటనే స్ఖలితమైపోవుట, సంభోగచింత గలుగుటచే తనకు తెలియకనే ఇంద్రియముపోవుట, కాలు చేతులు బలహీనత, జ్ఞాపకశూన్యము దృష్టిమాంద్యము మొదలైన లెక్కలేని వ్యాధులను పోగొట్టి వీర్యవృద్ధి, ధాతుపుష్టి, రక్తవృద్ధి తోగల్గి ఆహారము గల్గించును. శక్తిహీనమైన దేహావయవములకు బలమునిచ్చి వృద్ధి చేసి రక్తకండరములను పెంపొందించును. సాటిలేని సంభోగానందమును గల్గించును. స్త్రీలకు గలుగు ఋతుదోషము, రక్తము అధికముగ స్రవించుట సంతానాధిక్యము వలన దేహము కృశించుట, మర్మావయవము కృశించుట, బలహీనము, మర్మస్థానమున దురద, మంట, నొప్పి వేడిచే తెలుపుకారుట, మర్మసంబంధమయిన మేహవ్యాధులు మొదలయిన అనేకవ్యాధులను ఖండించి దేహమునకు పుష్టి, శరీరకాంతిని గలిగించును.

డబ్బి 1-కి 3-00

# జీవా (స్టమక్ పౌడర్ ఆపరేషన్ లేనిది)

సకలవిధ కడుపునొప్పులున్ను అపెండిక్సు అను కడుపునందు ఏర్పడువ్యాధినిన్ని కడుపునందు కలుగు వ్రణములు, గడ్డలు మొదలగు వాటిని కడుపును ఆపరేషన్ చేయకనే ఈ ఔషధము ఉత్తరవాదముతో గుణపరుచును. ఈ ఔషధము మలయాళీ అష్టాంగ విధానముగను మిక్కిలి ప్రయాసపడి తయారుచేయబడినది. ఔషధము అల్సర్, మలబంధము, పుల్లత్రేపులు, పేగులద్వారా కలుగు అనేకవిధవ్యాధులు, గుల్మం, భోజనము తిని మనుపోలేక తరువాతనో గలుగు కడుపునొప్పి మొదలగు అనేకవిధసంకటము లను ఖండితముగా గుణపరుచును. దీని విషయమై విశేషముగా చెప్పనేల? ఒకసారి [illegible] ఫలితము [illegible]:

[illegible] 2-50

# జీవానందరసాయనము.

ఇది బలమైన మందులతో మూలికలతో ప్రాచీనాయుర్వేదపద్ధతిని శాస్త్రీయంగా తయారైన గొప్పమందు. వ్యాధిగ్రస్తులే కాక ఎట్టి వ్యాధిలేనివారుకూడా దీనిని సేవిస్తే దేహాన్ని బలపరచి రసాయనంగా పనిచేయును.

దీనిని స్త్రీ పురుషులు నిరభ్యంతరముగా వాడవచ్చును.

మందు మంచి రుచిగావుండును. పథ్యము లేదు.

వీర్యనష్టం, ఋతుదోషం, నరముల నిస్సత్తువ, మేహరోగం, మూత్రదోషం మొదలైన వ్యాధులకు ఈ మందు పెట్టింది పేరు. మూత్రముతో పోవు శుక్లమును, మేహ చుర్నీరను, మేహవ్యాధిని, మేహదురదను, మూగతీటను, జననేంద్రియ సంబంధమైన రుగ్మతలను, జననేంద్రియం సన్నబడుట, చిక్కిపోవుట, లేపనశక్తి తగ్గివుండుట, మధుమేహం, నిద్రలేమి, ధాతుదృఢీకరణం లేకుండుట, నరముల నిస్సత్తువ మున్నగు వ్యాధులను ఇది తప్పక కుదురును, మేకావాత, మూలవాత, గుండెదడ, వెన్నునొప్పి, దగ్గు, శ్వాసము మున్నగు బాధలను నివారణచేయును.

ఆకలిలేమి, మలబద్ధం, నీరుపట్టు, నడుమునొప్పి, కాళ్లుచేతులు తీట, తెలుపు వ్యాధి, తలత్రిప్పుట, జ్ఞాపకశక్తితగ్గుట మొదలైన బాధలను నివారించి బలాన్ని, ఆరోగ్యాన్ని, దేహకాంతిని యిచ్చి యెంతో మేలుచేయును. శీఘ్రంగా ముసలితనం రాకుండా చేస్తుంది, డబ్బి 1-కి రు. 3-0-0

# సకలమేహసిద్ధాంత నూనె

వాత సంబంధమైన సర్వవ్యాధులను నిర్మూలముచేయు ఆగ్నేయాస్త్రము, యీ నూనెను సేవించుచున్న కడుపునందు చిరకాలమునుండి చేరుకొని యున్న వాతములను నిర్మూలించును. మలబద్ధమును పోగొట్టి దినమునకు రెండు మూడు సార్లు ప్రవర్తిని కలిగించి వ్యాధులన్నిటిని తొలగించును.

దీనిని సేవించిన శుక్లజాడ్యములు, బట్టంటు, గుండెబలహీనత, కండ్లు నొప్పులు, రణములు, గుల్మములు, మూత్రదోషములు, పక్షవాతము, బోదకాలు సంబంధమైన వాపులు, పడిసెగడ్డలు, వరిబీజము, బుడ్డ మున్నగు వ్యాధులను హరించును.

స్త్రీలకు సంబంధించిన సూతికావాతము, కుసుమవ్యాధి మొదలైన అనేక వ్యాధులకు అమోఘమైనమందు. వందలాది ప్రజలు ప్రశంసించియున్నారు. సీసా 1-కి 6-00

# కాంగ్రిన్ అను ప్రాణసంజీవి

అన్నిరకములైన మేహవ్రణములు, పుండ్లు, గడ్డలు, రాచపుండ్లను త్వరితముగా హరించును. రాచగడ్డ యెటువంటి స్థితిలో వున్నప్పటికిన్నీ కాంగ్రీన్ వుపయోగించిన స్వస్థపరచును. గడ్డలు పగులుటకు ముందును, పగిలిన వెనుకను యీ మందునే వుపయోగించుచున్న చీము పట్టనివ్వక త్వరితముగా పుండ్లను మాన్పును. మరియు కాళ్ళయందు గలుగు నటువంటి దురదతోకూడిన పొక్కులు, పుండ్లు, మేహ మొటిమలకున్ను యీ ఔషధము పరమశ్రేష్ఠమైనది. సీసా 1-కి 1-50

ఎస్. పి. గోపాల్ అండ్ కో.,

పి. బి. నెం. 74,—63, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మదరాసు-1.

---

# గోపాల్స్ లేహ్యము

స్త్రీపురుషులకగలుగు అన్నివ్యాధులకు దివ్యౌషధము. ఇది మలయాళ పద్ధతిలో మూలికారసములతో తయారు చేయబడినది. బలవర్ధకమైనది, రుచికరమైనది, సర్వకాలములయందును సేవించదగినది. మిక్కిలి ప్రసిద్ధిని పొందినది.

గోపాల్స్ లేహ్యము:— సేవించిన అధికమైన ఉష్ణము వల్లనూ, దురభ్యాసముల వల్లనూ, చెడు సహవాసముల వలనను కలుగు వ్యాధులను, దోషములను, బాధలను నిర్మూలించి ముసలివారిని సైతము శక్తివంతులగు యౌవనుల వలె చేయును.

గోపాల్స్ లేహ్యము:— సేవించిన మేహవ్యాధులను, పిత్తపాండు, క్షయ అతివేడి, ధాతునష్టము, నరముల బలహీనత, ఆయాసము, ఆకలిలేకుండుట, మలబద్ధము గుల్మము, అజీర్ణము, నిద్రపట్టకుండుట, గుండెదడ, వెన్నునొప్పి, దగ్గు, మోకాళ్ళ కాలుచేతులు బలహీనత, నడుము బలహీనమగుట, జ్ఞాపకశక్తి తగ్గుట, దృష్టిమాంద్యము మున్నగు వ్యాధులను నశింపజేసి రక్తవృద్ధి, ఆహారము, ధాతుపుష్టి కలిగించును.

గోపాల్స్ లేహ్యము:— స్త్రీలకు గలుగు బుతుదోషములు, కుసుమవ్యాధుల హరించును. శక్తిహీనమై కృశించిన దేహావయవములకు బలము, కండపుష్టి చేకూర్చును, శరీరకాంతిని, పుష్టిని కలిగించును.

డబ్బి 1-కి **3-00**

# మేహాంతక రసాయనము

ఇది అమూల్యమైన నూటయిరువది పచ్చిమూలికలను, ఉప్పుద్వారా అనేక వస్తువులు చేర్చి తయారుచేయబడినది. ఎటువంటి దుర్గుణములు కలిగి యెంతకాలమునుండి యున్న మేహవ్యాధులనైనను ధ్వంసముచేసి స్వస్థత కలిగించును.

దీనిని 5 పూటలు మాత్రము సేవించిన మేహ, తామర మచ్చలు, మేహదురదలు, గజ్జి, మేహవాయువు, అధిక మేహము వలనవచ్చు పచ్చకామెర్లు, మున్నగు మేహవ్యాధులను, సెగమున్నగు సుఖవ్యాధులను, స్త్రీల కుసుమవ్యాధులను నశింపజేయును. మరియు కంఠమాల, ఆసన సంబంధమైన మూలవ్యాధులు, గ్రంధి, పార్శ్వవాయువు, మూత్రదోషములు, నడుము నొప్పి, ముఖము ఉబ్బుట, మూత్రకజన్ని, కాళ్ళుచేతులు పట్లుబట్టుట ఏనుగుకాళ్ళవలె ఉబ్బుట మున్నగు వ్యాధులను నివారణచేసి, రక్తమును వృద్ధిపరచి దేహమునకు చక్కని తేజస్సును, బలమును ప్రసాదించును.

5 పూటలకు మందు **3-00**

# మూలరోగ సంజీవి లేహ్యము

ఇది చీముతోకూడిన మూలము, రక్తముపడు మూలము, లోపలిమూలము, బయట మూలము, బెట్టమూలము అను వివిధ మూలవ్యాధులను, సకల విధముల మేహవ్రణములను నిర్మూలించును. మూలవ్యాధితో యెంతకాలమునుండి బాధపడుచున్న వారికైనను స్వస్థత కలిగించు గొప్పమందు.

డబ్బి 1కి **2-00**

ఎస్. వి. గోపాల్ అండ్ కో.,

పి. బి. నెం. 74,—68, కృష్ణప్పనాయకన్ గుంటవీధి, మదరాసు-1.

---

# గోపాల్స్ టానిక్

ఆకలిని కలుగజేసి బలమును ఇచ్చు సర్వశ్రేష్ఠ ఔషధరాజము

1 గోపాల్స్ టానిక్ అను ఈ ఔషధము ఆయుర్వేదము, యునానీ వైద్యములలోని ఘన మూలికలచేతను తయారు చేయబడినది. ఇందులో శక్తి ఉపయోగకారియైన వల మోతాదులు.

2. గోపాల్స్ టానిక్ అను నీ ఔషధమును సేవించిన బలహీనము, దేహాశ్రమము, సాలసత్వము, నపుంసకత్వము తొలగించి దేహమునకు బలముకలిగించును. ధాతుపుష్టియు, మహాదారుఢ్యమును కలుగజేయు గొప్ప ఔషధము.

3. గోపాల్స్ టానిక్ అను నీ ఔషధము జీర్ణశక్తి లోపించినవారు సేవించిన జీర్ణశక్తిని కలిగించి ఆకలి పుట్టించును. ఎటువంటి పదార్థము భుజించినను త్వరలో జీర్ణము చేయుటకొనగల శక్తిని కలుగజేయును.

4. గోపాల్స్ టానిక్ సేవించుచున్న రక్తమును వృద్ధిపరచి దేహపటుత్వమును కలిగించును. నరములకు బలమును కలుగజేసి వృద్ధులను వయోవంతులుగా చేయును. దీనితో సమానమగు టానిక్ మరొకటి లేదు. సీసా 1-కి **1-50**

# మదన మనోహర లేహ్యము

దీనిని సేవించిన ఏనుగువంటి బలమును, ధాతుపుష్టియు కలుగును. ఈ లేహ్యము అమూల్యమైన అనేక మూలికలచే తయారు చేయబడినది. దీనిని పిల్లలు పెద్దలువాడదగి యున్నది. దీనిని సేవించిన బలము, రక్తవృద్ధి, కండపుష్టి కలుగును. బలహీనము, అజీర్ణము, ధాతునష్టము, కాళ్ళుపీకుట, గుండెదడ మున్నగు రోగములను నిర్మూలించి వృద్ధులు సైతము యౌవనులవలె సుఖభోగము అనుభవించునట్లు చేయగలదు. దీనిని ఒక సారి వాడిచూచిన దీనివలన యేయే లాభములను పొందగలరో తమంతటామే గ్రహించుకొనగలరు. 40 రోజులకు **4-00**

# చెవినొప్పి తైలము

చెవిపోటు, చెవులనుండి చీముకారుట, చెవులు దిమ్ముగా వుండుట, హోరు మున్నగు చెవిబాధలను యీ తైలము వాడిన తక్షణం నశింపజేయును. చెవిపోట్లు మున్నగు బాధలకు గొప్పమందు 2 సీసాలు **1-00**

# తలనొప్పి తైలము

అన్నినొప్పులకు అమోఘముగా పనిచేయు అద్భుత తైలము. ఈ తైలమును రుద్దిన తలనొప్పి, పార్శ్వవాయువు, తొడలనొప్పులు, కడుపునొప్పి, చీజరోగము, గొంతు నొప్పి, శిరోభారము, ఒంటితలనొప్పి మున్నగుబాధలు 5 నిమిషములలో పటాపంచలై పారిపోవును. 2 సీసాలు **1-00**

# రతి మన్మధ బంగారు గుళికలు

'ఆనందో బ్రహ్మ' యని వేదవాక్యం! అట్టి బ్రహ్మానందమును జీవితకాలమున పొందవలెనని కోరు అర్హత అవసరము ప్రతివ్యక్తికిని గలదనుటలో అతిశయోక్తి లేదు.

గోపాల్సు బంగారు గుళికలు అట్టి ఆనందము నిచ్చునట్టివని చిరకాలమునుండి ప్రసిద్ధి పొంది యున్నవి.

మంచి బలము; దేహపుష్టి, రక్తపుష్టి, ధాతుపుష్టి; చక్కని శరీరకాంతి; చురుకుదనము కలిగి ఆరోగ్యముగానున్నవారే ఆనందముగా జీవించగలవారలు. అట్టి ఆనందముతో జీవించుటకు అవసరమైనవన్నియు ప్రసాదించగలవి గోపాల్సు బంగారుగుళికలు.

అమూల్యమైన యీగుళికలు సేవించుచున్న ఏనుగువంటి బలము, దేహపుష్టి, ధాతుపుష్టి, రక్తవృద్ధి కలుగును. నరములకు, ఎముకలకు ఉదర క్రమము ప్రసరింపజేసి బలముగానుంచును. దేహమునకు బంగారువంటి తేజస్సునిచ్చును. మనస్సునకు ఉల్లాసమును, చురుకుదనమును కలిగించును. రక్తమును శుద్ధిపరచి వృద్ధిచేయును. [illegible] పోగ్రోలును. అజీర్ణము, కడుపుబ్బు, ఆకలి లేకపోవుట మున్నగు ఉదరరోగములను, సర్వవిధ వ్రణములను పోగొట్టును.

గోపాల్సు బంగారు గుళికలు సేవించుచున్న వ్యక్తులు ఆనందముగా జీవితమును గడుపగలరనుటలో నెట్టి సందేహములేదు. కనుకనే ప్రజాభిమానమును పొంది ప్రఖ్యాతిగాంచియున్నవి. ఒకసారి వాడిచూచిన మీకే తెలియును.

100 మాత్రలు **7-00**

# కత్తినరుకు గాయములకు తైలం

కత్తివలన గాయమైన భాగమున యీ తైలమును రుద్దిన వెంటనే బాధను పోగొట్టి రెండు, మూడు రోజులలో గాయమును మాన్పును. గాయమునకు చీము పట్టనివ్వదు. ప్రతియింటియందును తప్పక వుండదగినది. సీసాలు 2-కి **1-50**

# కాసా

అన్నిరకములైన దగ్గులకు రామబాణమువలె పనిచేయు దివ్యౌషధము. ఇది మరి యూని శాస్త్ర పద్ధతిని అనేక భస్మములు, మూలికలు చేర్చి తయారుచేయబడినది. దగ్గులను ఖండించుటలో దీనికి సాటియగు మందులేదు.

దీనిని సేవించిన శ్వాసకాసములు, కఫము, గొంతు కమ్మకపోవుట, గొంతురణం, గుండెదడ, క్షయదగ్గు, ఊపిరితిత్తులలో యేర్పడు ఆరని రణాలు, దగ్గుతో కూడినజ్వరం, ఆయాసము, బలహీనత, తలనొప్పి, దేహముచల్లబడి చెమటపట్టుట, కండ్లలోతుకు పోవుట, కఫంలో రక్తంపడుట, పైత్యవికారములు, ఊపిరి పీల్చుటకు కష్టముగానుండుట మున్నగు వ్యాధులను నశింపచేయును. రక్తమును శుభ్రపరచును. గుండెకు మంచి బలమునిచ్చును. స్త్రీ పురుష లెల్లరును వాడదగినది. దగ్గులను ఖండించుటలో రామబాణమువలె పనిచేసి సుఖమునిచ్చును.

**2-50**

# స్నానామృత తైలము

ఈ తైలమును వారమునకు ఒకతూరి తలస్నానము చేసినయెడల శిరస్సునకు కన్నులకు ఏ వ్యాధియురాక కాపాడును. శిరో రోగములను, కన్నుమంటలను ఉష్ణమును పోగొట్టును. రక్తవేడి మొదలగు వేడి వ్యాధులను నశింపజేయును. చదువరులు చేతి పనులుచేయు మానవుల మెదడునకు సహాయకారియగు ఇది యొక మహత్తైన తైలము

మీరు గర్భమునకు ఔషధము భుజించు సమయములయందు ఈ తైలముతో స్నానము చేయుట నిండా శ్రేయస్కరము.

మీ దేహమునకు ఆరోగ్యము కావలయునంటే ఈ స్నానామృత తైలమే సుఖాదార మనదగును. ఒకతూరి తీసి వాడిచూచిన దినిగుణము మీకే తెలియును.

 డబ్బి 1-కి రూ. **2-00**



# మల విసర్జన లేహ్యం

[illegible]లు మొదలు వృద్ధులవరకు స్త్రీపురుషులెల్లరు సేవించదగినది. రుచికరమైనది. దీనిని సేవించిన మలబద్ధమును నిర్మూలించును. మరియు కాళ్లుచేతులు పోట్లు గర్భవాయువు, మూలవాయువు, అపానవాయువు. గుల్మవాయువు, మలకుమ్మ్రమా మొన్నగు ఉదరవ్యాధుల నివారించి కడుపును శుభ్రపరచును. నిత్యము సకాలమందు బహిర్భూమి సుఖముకల్గును. డబ్బి 1-కి **1-00**

# వాతగజాంకుశం

(కీళ్ళ నొప్పులకు మంచి ఔషధము)

మేహవాతం, అండవాతం, ఉబ్బువాయువు, పక్షవాతం, మోకాళ్ళలో మోచేతులలో పట్లు, ఎముకల మూలుగులో నొప్పులు, మొదలగు సకల వాతరోగాల్ని ఖండించడంలో సాటిలేని ఔషధము. అరికాళ్ళు అరిచేతులు నడుము నొప్పులు, వరిబీజము ప్రారంభ దశలోవున్న ఏనుగుకాలిరోగం, మలబద్దము, తొడలుపీకులు, నరాలు బిగువుపడడం, శరీరం లావుయెక్కడం, అందువలన లేచినా కూర్చున్నా ఆయాసంగా వుండడం అపానవాయువు కడుపుబ్బడం ఎగశ్వాస శ్వాసకాశ గుండెనొప్పి గుల్మరోగములు సర్వవ్యాపి ఐన వాయువు స్త్రీలకు ప్రత్యేకంగా కలిగే బుతుదోషాలు మొదలయిన పలువిధ వాతరోగాల్ని మాన్పించి మలమూత్రాదులను జారీచేసి దేహానికి ఆరోగ్యం కలిగించును. క్రిములకు నాడాపాములకు కూడా పనిచేయును. బిడ్డల మాంద్యరోగం తగ్గును.

స్త్రీ పురుషులు ఉభయులూ వాడతగినది. మంచి మూలికలతో తయారుచేయబడిన గొప్ప ఔషధము. సీసా 1-కి రూ. **3-00**